# నవ్య సాహిత్య పరిషత్తు

## గౌరవాధ్యక్షులు

గిడుగు వెంకట రామమూర్తి పంతులు

కట్టమంచి రామలింగారెడ్డి

## కార్యనిర్వాహక వర్గము ౧౯౩౭

| | | |
|---|---|---|
| బుర్రా శేషగిరిరావు పంతులు | ... | అధ్యక్షుడు |
| కాటూరి వెంకటేశ్వరరావు | ... | ఉపాధ్యక్షుడు |
| తెలికిచెర్ల వెంకటరత్నం | ... | కార్యదర్శి |

## సభ్యులు

| | | |
|---|---|---|
| పప్పూరి రామాచార్యులు | ... | అనంతపురము |
| చిలుకూరి నారాయణ రావు | ... | ,, |
| దేవరపల్లి వెంకట కృష్ణా రెడ్డి | ... | ఉలవపాడు |
| నోరి నరసింహ శాస్త్రి | ... | రేపల్లె |
| కొడాలి ఆంజనేయులు | ... | తెనాలి |
| పిల్లలమర్రి బాలకృష్ణ శాస్త్రి | ... | ,, |
| అడివి బాపి రాజు | ... | బందరు |
| బొడ్డు బాపి రాజు | ... | ఏలూరు |
| ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి | ... | రామచంద్రపురము |
| వేదుల సత్యనారాయణ శాస్త్రి | ... | పెద్దాపురము |
| కోలవెన్ను రామకోటీశ్వర రావు | ... | మద్రాసు |
| గురుభాగవతుల ధర్మా రావు | ... | బరంపురం |

## పూర్వాధ్యక్షులు

| | | |
|---|---|---|
| చిలుకూరి నారాయణ రావు | ... | ౧౯౩౩ |
| రాయప్రోలు సుబ్బా రావు | ... | ౧౯౩౩—౩౪ |
| తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి | ... | ౧౯౩౪—౩౫ |
| పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి | ... | ౧౯౩౫—౩౬ |
| గిడుగు వెంకట రామమూర్తి పంతులు | ... | ౧౯౩౬—౩౭ |

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక



ప్రతిభ చందా రెండు రూపాయలు : విడిసంచిక అర్ధరూపాయి

జూలై. అక్టోబరు. జనవరి. ఏప్రిల్ మాసములలో ప్రకటన

# శ్మశాన స్వస్తి

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం యువరాజా వారు

కాష్ఠములు నన్ను జ్వాలలఁ గాల్చునపుడు
అగ్నిజిహ్వలు తను వెల్ల నలమునపుడు
నెమ్ము లన్నియు దుమ్మయి నెగయునపుడు
నంగ మంతయు భస్మమై యంతరింప
దుర్భరాంధోళయుతజీవధూమపంక్తి
గగన వీథిని మేఘాలఁ గలసిపోవ
నాథునిక జీవితపు నాటకాంతమందు
స్వస్తి చెప్పితిని మహాశ్మశానమందు.

ప్రేమకోటకు విలాపించి వెతకు బ్రతుకు
బరువు మోఁతను గ్రుంగుచుఁ బాటునడచి
పాడుతనువును మంటలపాలు చేసి
పాపవార్థిని దరియించెఁ బ్రాణ మపుడు.

వచ్చియును రాని కన్నీళ్లఁ బరఁగఁ జేసి
వ్యర్థవాక్యాల శాంతిని బాఱఁద్రోలి
బంధుమిత్రులు గావించు ప్రాణహింస
యా నరకలోక బాధలయనుభవంబు
బ్రతికి యున్నంతవఱకును బ్రతుకు నెల్ల
దుఃఖభూయిష్ఠముగఁ జేసి తుదకుఁగూడ
నాత్మ నెంతయు నిక్కట్ల నలయఁ జేయు
మానవుని క్రౌర్య మెచట సామ్యమును బొందు ?

చచ్చినాఁడను మీకనుల్ చల్లఁబడఁగఁ
జాలదా మీకు నీ మంటచల్లఁదనము
దహానవేళను నాశిరస్థ్సలమునుండి
పాదము మంటలు మీకు నపూర్వమైన
దివ్యమంగళ హారతిఁ ద్రిప్పలేదె ?
చాలదా చాలదా ? మీకుఁ జాల దేమొ
యట్లయిన మంట లాఱినయంతలోన
నాదు బూడిదఁ గాళ్లతో సలిపివైచి
యచ్చటనె నీళ్లతోఁ గల్పి పుచ్చుకొనుఁడు
పైన నంతటితోనైన మాను(ఁ)డింక
ననుసరింపఁగ వలదు సన్న చటఁగూడ
నొక్క మాటయె వచియించి యూరకుందుఁ
జితిని బడి యున్న నాచిన్ని చివరి కోర్కె
మన్నన యొనర్తురే మీరు మనుజులార !

నేను నీ లోకమున నెప్పుడేని యెందు
నైన నొక్క సత్కార్యము నాచరించి
నాఁడనేని తత్ఫలముగా నాదుమాట
పూర్తిగా నిప్పుడె మఱచి పోవవలయు
శ్రాద్ధకర్మముల్ నాకయి జరుపవలదు
పిండములనేనియును మీరు పెట్టవలదు
చేయవలదు తిలోదక సేచనములు
కలుప వలదు నాయస్థికల్ గంగలోనఁ
దద్దినంబులమాటయే తలఁపవలదు
అర్పణముచేయవల దింకఁ దర్పణముల
నన్ను మఱచుటయే మీరు నాకుఁ జేయు
నూత నాపరకర్మంబు భూత తృప్తి.

# శ్మశాన స్వస్తి

స్వస్తి సర్వ నృ రాక్షస సంస్థ,
స్వస్తి భూలోక జీవనాసత్యగతికి
స్వస్తి సకలమహాదుఃఖవారినిధికి.

నరులలోకము విడనాడి యరుగునపుడు
పరుగువాఱంగ మనసులో వాంఛ యొదవు.
వచ్చులోకాల నెటువంటి పంత లున్న
నాధునిక జీవితపు వంతయులఁతె దాఁటు
దుముకుచుండు నీ జీవికిఁ డోఁచ దన్య
మదియె నైజగుణముగదా యారునకును ?

# సౌందర్య పోషణ పద్ధతులు

[లేడీస్ కల్చర్ క్లబ్]

"దీక్షిత్"

ప్రపంచంలో ఏమూలో ఏదో చిన్న కార్యం జరిగితే దానితో మన కేమీ సంబంధం లేదని ఈ రోజుల్లో అనుకోడానికి వీల్లేదు. మనకు సంబంధంలేని ఒక కార్యమే కారణముగా పరిణమించి మన జీవితంలో విప్లవము కలగచెయ్యవచ్చు.

చెప్పవచ్చినమాట ఏమిటంటే, ఎక్కడో చెన్నపట్నంలో శ్రీఆదినారాయణ శాస్త్రి గారు రేడియో ప్రసంగం చెయ్యడ మేమిటి? నాకు ఒక నెల్లాళ్ళు ఏలినాటి శనిపట్టుకొని బాధించడం ఏమిటి? ఆ కార్యానికీ ఈ కార్యానికీ ఏమైనా సంబంధం ఉన్నదా? జీవితం అంతా ఇదే విధం!

ఇంతకీ పుట్టిమునక మాయింట్లో ఒక రేడియో పెట్టడంవల్ల వచ్చింది. ఫాషన్ కోసం నిజానికి మాయింట్లో మేము రేడియో యంత్రాన్ని పెట్టుకొన్నాం. ప్రతి రోజూ దాన్ని ఉపయోగించుకొని దాని వల్ల కలిగే ఆనందాన్ని అనుభవించడం మాత్రం లేదు.

ఒకరోజు నాదురదృష్టంకొద్దీ సాయంత్రమే వటీరావు యింటికి వచ్చి రేడియో తిప్పుకు కూచుంది. అప్పుడు నేను యింట్లోలేను. ఆరోజునే శాస్త్రిగారు కూడా ప్రసంగం చేశారు—ప్రాచీన హైందవుల సౌందర్య పోషణపద్ధతులను గురించి.

ప్రాచీనకాలంలో ఎట్టి సౌందర్య పోషణ పద్ధతులుంటే మాత్రం ఏమి? అవన్నీ యీ కాలపు ఆడవాళ్లకు చెప్పొచ్చునా? దేశ కాల పాత్రముల ననుసరించి కదా పెద్దలు మాట్లాడాలి! ఇంతకీ శాస్త్రం ఎలాగు ఉంటే ఏమి? ఆచారం ప్రధానంగా చేసుకొని హితబోధ చేస్తే ఎంత ఉపయోగకరంగా ఉండేది!

జరిగిందేమిటో జరిగింది. ఆ రాత్రి నేను యింటికి వచ్చాను.

'వెల్ మైడియర్, అద్భుతమైన రేడియో ప్రసంగం మీరు పోగొట్టుకొన్నా' రంది వటీరావు.

'ఏమిటి సంగతి డార్లింగ్' అన్నాను.

'అందమైన ప్రసంగం వినే అదృష్టం మీకు లేకపోయింది గదా అని విచారిస్తున్నాను'

'ఏమిటో ఆప్రసంగం?'

'అది దివ్యంగా ఉంది. మీకు ఎంతో పనికి వచ్చేది'

'పోనీ రేడియో పెట్టినందుకు ఆ మాత్రం ఆనందం నీకు కలిగినందుకు సంతోషిస్తున్నాను' అన్నాను.

'మనిద్దరికీ ఆ ఆనందం వచ్చిఉన్నట్లయితే దాని విలువ కూడదీసిఉండునుకదా అనుకొంటున్నాను.'

'పోనీ, ఇంకోమాటు.'

'ఇంకోమాటు ఇదే ప్రసంగం ఉంటుందా డియర్ హాబ్బీ!'

'ఉండకపోతే యింకో టాయెను.'

'మీకెప్పుడూ యింతే! దేనికీ ఉత్సాహం లేదు.'

'ఆ ప్రసంగం ఏమిటో చెప్పావు కావు డార్లింగ్.'

'శాస్త్రసమ్మతమైన ప్రసంగమే.'

'ఓహో అలాగా; అయితే చెప్పు, చెప్పు'

'పూర్వాచారపరాయణులు విచ్చిందికూడా'

'అయితే యింకనేం! విననందుకు నేను చాలా విచారించడమే కాకుండా నీకు క్షమాపణకూడా చెప్పుకొంటున్నా'

'విన్నట్లయితే దానిప్రకారం ఆచరిస్తారనుకొంటాను'

'అది ఆలోచించవలసిన విషయమే'

'శాస్త్ర సమ్మతమైన విషయాన్ని ఒక పండితుడు చెప్పితే ఇంకా ఆలోచించవలసినదే అంటారా, మైడియర్ పూర్వాచార పరాయణరావుగారూ?'

'ఆ సందర్భాలలో ఆలోచన అక్కరలేదనుకుంటాను వటీరావుగారూ'

'అయితే చెబతాను. వినండి. పూర్వకాలంలో స్త్రీలకు అలంకరణం పురుషులు చేసేవారట విన్నారా?'

'అంటే?'

'మైడియ్యర్ స్వీట్! అంటే అర్థంకాలేదా?'

'వ్యాఖ్యానం చెయ్యి కొంచెం చూస్తాను'

'పురుషులు—అంటే లవింగ్ హాబ్బీలు, స్త్రీలకు—అంటే డార్లింగ్ వైఫీలకి అలంకారాలు చేసేవారట స్వయంగా, స్వహస్తాలతో.'

'ఏమిటో ఆ అలంకారాలు?'

'పూర్వపు స్త్రీలు చేసుకొనేవంటారా?'

'ఈకాలపు స్త్రీలు చేసుకొనేవి నాకునిత్యం అనుభవంలోనే ఉన్నాయిగా!'

'అయితే చెబుతావినండి—ఫేసు పౌడర్లు, లిప్ పెయింట్లు, టీత్ పాలిష్, ఫుట్ డెకరేషన్, బాడీ డెకరేషన్ వగైరాలు.'

'ఇంగ్లీషున చెబితే స్వారస్యం చెడుతోంది. రవంత మాతృభాషలో చెబుదూ?'

'పండితుడు కాబట్టి ఆయన ఆ పేర్లన్నీ మీ మాతృభాషలో చెప్పారు. ఆపాడు పేర్లన్నీ నన్ను జ్ఞాపకం ఉంచుకోమన్నారా?' అంది నేనేదో అకార్యకరణం చెయ్యమన్నట్లు భావించుకొని.

'పాడుపేర్లు అక్కరలేదు. కాని ఆపాడు

కార్యాలు నీకు కావాలి కామోసు—కాదూ?'.

'ఏం తెలివి తేటలు—ఆపేర్లను నేను తిట్లాను కాని ఆకార్యాల కేమి నిక్షేపంలాంటివి! వాటి నేమీ నే నస లేదే'.

'అయితే యివన్నీ—నీవు చెప్పిన యీ అలంకరణాలన్నీ—ఆ పండితుడు పూర్వ కాలంలో ఉన్నట్టు చెప్పాడా?'.

'ఆ, కావలిస్తే పేపర్లో రిపోర్టు కూడా పడు తుంది చూద్దువుగాని'.

'ఆయనేదో పెద్దమనిషి అనుకొన్నాను'.

'ఆయ న్ననడం ఎందుకూ? శాస్త్రంలో ఉన్నవిషయం పాపం, ఆయన చెప్పారు'.

'ఏ శాస్త్ర మన్నారు?'

'వాత్స్యాయన కామసూత్రా లట.'

'సరే బాగానే ఉంది. మనకెందుకు పోనిస్తూ ఆగొడవ.'

'ఆగొడవ మనకెందుకా? ఇప్పుడే కాదు మీరు శాస్త్రంలో చెప్పిందయితే చేస్తా మన్నారు?'

'అన్నమాట నిజమే. నన్ను చేసుకోమం టావా ఆ అలంకరణాలు?'

'మీరు చేసుకొంటేనా-ఇంకనేం - అయితే మకరికా పత్రాలు ఎక్కడ రచించుకుం టారో!'

'నేను చేసుకో నక్కర లేకపోతే నువ్వే చేసుకో.'

'నే చేసుకోడానికి మీ ఆజ్ఞ ఎందుకూ? నే నెలాగా చేసుకొంటాను—అనగా-'

'అనగా?'

'శాస్త్రంలో ఆవిధంగా చెప్పబడ్డది కాబట్టి మీరు నాకు రోజూ అలంకరణం చెయ్యా లన్నమాట'

'నేనా?'

'మాట తప్పరు కాదూ డియర్ హాబ్బీ ఎప్పు డూను?'

'అయితే ఆపత్రిసంగం ఏమిటో చదివి దానిలో చెప్పిన వస్తువు లేమిటో చూచి—ముందుగా ఆయుర్వేద వైద్యశాల స్థాపించి ఆ అలంకరణ ద్రవ్యాలన్నీ నేను తయారు చెయ్యాలన్నమాట'

'సిల్లీ! దేశకాలాల ననుసరించి ఇప్పుడు దొరికే అలంకరణ ద్రవ్యములతోనే మీరు నన్ను రోజూ అలంకరించాలి.'

'ఫర్ యిగ్జాంపెల్ - యేమి చెయ్యవలసి ఉంటుం దంటావు'

'పూర్వస్త్రీలకు పురుషులు పారాణి పెట్టే వారట'

'నువ్వు పారాణే పెట్టుకుంటె నేను బ్రహ్మ రథం పట్టనూ—తప్పకుండా నీకు పారాణి పెట్టి పెడతానులే'

'సిల్లీ ఎగైన్! వినండి హాబ్బీగారు! ఈ కాలంలో పారాణి లేదు, అనగా స్త్రీలు పెట్టుకోవడం లేదు, కాబట్టిన్నీ దానికి

ప్రిత్యామ్నాయం జోళ్లు తొడుక్కుంటున్నారు కాబట్టేన్నీ మీరు నాకు రోజూ మేజోళ్లూ జోళ్లూ తొడగాలి - ఇది నంబరు వన్. నంబరు టూ—మీరు నా జోళ్లు రోజూ తుడిచి వాటికి కివీపాలిష్ వేస్తూ ఉండాలి'—

'తొండముదిరి ఊసరవిల్లి అవుతోందే'

'నక్కముదిరి వరదు కావడంలేదో'

'వటీరావుముదిరి ఆ ఊసరవిల్లీ ఈ వరదూ కాకుండా ఉంటేచాలు నామట్టుకు'

'నన్ను ఇన్‌సల్టు చేశారంటే ఎరుగుదురా! వినండి చివరదాకా, మీరు నిత్యమూ చెయ్యవలసిన పనులు'

'వినడానికి నా అభ్యంతరం లేదు.'

'చెయ్యడానికిఎందుకు అభ్యంతరంఉండాలో నే చూస్తాకాదూ—పూర్వకాలంలో పురుషులు స్త్రీలకు పత్రిరచన చేసేవారట—ఈ కాలంలో అదిచేసుకొంటే బార్బరస్‌గా ఉంటుంది కాబట్టి మీరు అందుకుబదులు నా బాడీ మసాజ్ చేయవలసి ఉంటుంది—'

'అంటే కాళ్ళు పట్టమంటావా?'

'తప్పేమిటి? తరతరాలనుంచీ స్త్రీలు పురుషుల కాళ్ళు పట్టడంలేదూ. ఇప్పు డాపని పురుషులే చెయ్యాలంటే ఎందుకో అభిమానం? సమాన హక్కులు, స్త్రీ స్వాతంత్ర్యం - ఇత్యాది మాటల కర్థం ఏమిటో?

తరవాత తరవాత'

'తరవాత శ్రీరావుగారూ! తమరు నాపళ్ళకు మెరుగువచ్చేటందుకు ప్రతిరోజూ వరిగింజతో తోమవలసి ఉంటుంది. ఇంతేకాకుండా ఫేస్‌పౌడర్, లిప్‌స్టిక్, బ్రౌపెన్‌సిల్, స్నో, నెయిల్‌క్లిపర్సు వగైరా వస్తువులు మీవద్దనే ఉంచుకొని సరియైన కాలానికి వాటిని నాపట్ల ఉపయోగిస్తూ ఉండాలి.'

'అంటే నన్నే నీ మొహానికి పౌడరు పుయ్యమంటావా? నీ పెదవులకు రంగు వెయ్యమంటావా? నీ కనుబొమ్మలు దిద్దమంటావా? ఊఁ.'

'అవును. శాస్త్రసమ్మతమైన పను లేకదా నేను చెయ్యమంటూంట! చేస్తామని వప్పుకున్నారుకూడాను-చేస్తారా?'

ఆలోచనలో పడ్డాను. చేస్తాననడానికి పురుషత్వాభిమానం—చెయ్యననడానికి వాగ్దత్తము చేశానుగదా. ఇది వదల్చుకోడానికి మార్గాలేమీ లేవా? ఆలోచించగా ఆలోచించగా ఒక అద్భుతమైన కార్యక్రమం స్ఫురించింది.

'వటీరావు ఆజ్ఞాపించింది కాదనడానికి వశమా?' అన్నాను

'నోర్నైస్—వటీజ్ గుడ్ హబ్బీ' అని నన్ను వీపు చరిచింది.

'అయితే ఒక షరతు ఉన్న'దన్నాను.

'షరతు లేమిటి మళ్లీ' అని మొగం చిట్లించింది.

'మాయాప్రవరు డంతవాడే మంతులు పెట్టాడు.'

'పోనిద్దు రా పాడుగొడన! మీ మంతు లేమిటో?'

'నేను నీకు అలంకరణం చేసేటప్పుడు నీవు అద్దం చూచుకోరాదు.'

'చూస్తే?'

'అదుగడుక్కీ నన్ను సాధిస్తావని భయం.'

'అగ్రీడ్.'

జోళ్ళు తుడిచి వాటికి రంగు వెయ్యడం, కాళ్ళు పట్టడం విషయంలో - సామదానములు ప్రయోగించడం వల్ల కార్యసాధన కావొచ్చునని ఊహించాను.

౨

నాకూ వటీరావుకూ మనస్పర్థలు కలిగిన మాట నిజము. ఒకమోస్తరుగా విరోధమే కాదు యుద్ధం సంప్రాప్తించిన దన్నా అసత్యంకాదు. ఉభయులకూ మాట పొత్తు చెడింది. దానితో అన్ని పొత్తులూ చెడ్డవి. నేను యింటిపెద్ద భోజనం! ఆవిడ క్లబ్బులో భోజనం!

ఈ విరోధభావానికి కారణం ఆ నాటి రేడియో ప్రసంగమేనని వేరే చెప్పడ మెందుకు? నేను వటీరావుకు అలంకరణం చేస్తానని ఒప్పుకొన్నమాట వాస్తవమే. ఆవిధంగామాటతప్పకుండా చేశాకూడాను. అద్దం చూచుకోకుండా వటీరావు కూర్చున్నమాటకూడా వాస్తవమే. ఫేస్ పౌడరు పూశాను; పెదవులకు ఎర్రకణికతో రంగు వేశాను; కనుబొమ్మలకు నల్లరంగు పూశాను; చెక్కిళ్ళకేదో పుయ్యమంటే అది పూశాను; గోళ్ళు కత్తిరించాను; గోళ్ళ పై భాగానికి గులాబిరంగు పూశాను. వగైరా పనులు యథాశక్తిగా చేశానని అనుకున్నాను. ఆగొడవలన్నీ నాకేం తెలుసును? అలంకరణకార్యక్రమం ముగిసిన పిమ్మట నాయిక అయిన వటీరావు ముకురవీక్షణం చేసింది. చేసి నామీద మండిపడింది.

మొహం అంతా విభూతి పూసినట్లు పూసి తనకు నేను బైరాగివేషం వేశానంది. పెదవులకి రంగు ఎక్కువగా పులిమి ఓష్ఠసౌష్టవం పాడుచేశానని అరిచింది. చెక్కిళ్ళకి ఎర్రమరకలు చేశానుట; కనుబొమలకి మసి పామి నాటి అందం పాడుచేశానుట. సలక్షణమైన ఆవిడముఖాన్ని వికృతం చేశానుట- చెయ్యాలనే చేశానుట. పూర్వకాలపు పురుషుల కుండే స్త్రీగౌరవము, సౌందర్యజ్ఞానము ఈకాలపు వారికి లేవనడానికి నా పనులే నిదర్శనమంది. ఇంతటి అవమానం తనకు చెయ్యడం న్యాయమేనా అంది. తగినశాస్తి చేసితీరతానంది. నన్ను గదిలోంచి బయటికి పొమ్మంది. బయటికి వచ్చాక తాను ఏడవడం మొదలుపెట్టింది. నాకు జాలివేసి అనునయించడానికి లోపలికి పోబోతూంటే పౌడరుడబ్బా నామీదకు విసిరింది. అది వచ్చి నా మొహానికి

తగిలి బొప్పికట్టించడమే కాకుండా మొహం ఒళ్లూ బట్టలూ పౌడరుమయంచేసింది. పరిస్థితులను బట్టి వెనక్కితగ్గడమే వివేకముగా భావించి స్నానపు గదిలోకి పోయాను.

నా భార్య సాయంత్రం వరకూ సబ్బుతో మొహం కడుగుతూనే ఉంది—రంగులు వదుల్చుకోవడానికి. సాయంత్రం మళ్లీ ముస్తాబై క్లబ్బుకు వెళ్లిపోయింది.

* * *

కొద్దిరోజులు గడచినవి. నేను ఒకనాడు బీచికి షికారుపోయి పరధ్యానంగా తిరుగుతున్నాను. ఆ సముద్రఘోష, ఆ గాలి రొద, ఆ ఇసుక పెరలు, నాఅవస్థ —ఇవన్నీ మనస్సులో తిరుగుతూనే ఉన్నవి.

'డెవిల్' అనే శబ్దం నా చెవులో హఠాత్తుగా గుచ్చుకుంది. పరధ్యానం మాని పక్కకు చూచాను. ఎత్తుమడమల జోళ్లు తొడుక్కొన్న యిద్దరు హైందవస్త్రీ రత్నములు గబ గబ నడిచి వెళ్లిపోతున్నారు. వారిలో ఒకఆమె నన్ను పలకరించిన పలకరింపు అది. వారిద్దరూ క్లబ్ మెంబర్లే అని చెప్పవలెనా?

పాకం ముదురుతోన్నట్లుంది. ఏ విధంగా సంసారం ఫాస్టుపరుచుకోవడం? ఎన్నాళ్లు ఈ ప్రవాసం? ఎందుకీ సముద్రఘోష? ఈ గాలిఎక్కడికి పోతూంది ఇంత వేగంగా? ప్రపంచంలో నా దుఃఖానికి చలించినవాళ్లు ఎవరూలేరా? —మళ్లీ పరధ్యానంలో పడ్డాను.

'బ్రూట్' అని ఒక కలభాషిణి నాచెవులో బుసకొట్టింది. డెవిల్నా నేను! బ్రూట్నా నేను! క్లబ్బువాళ్ళకు కొంత చులకనయ్యాను. వీళ్ళందరిని పురికొల్పింది వటీరావే అనడానికి సందేహం ఉందా? ఏమిటి కర్తవ్యం? ఇక బీచి ప్రాంతాలని ఉన్నట్లయితే మాట దక్కదనుకొన్నాను. సూర్యుడింకా అస్తమించలేదు. అస్తమించబోతున్నాడు. ఇప్పటికి తిటతో సరిపోయింది. చీకటిపడితే ఎట్టి ప్రమాదమైనా తటస్థించవచ్చు.

పదిమంది క్లబ్బుమెంబర్లు కలిసి దేహశుద్ధి చేస్తే చేసేదేమిటి? నలుగురూ చూస్తే ఎలాగ ఉంటుంది!

బతుకు దుర్భరంగా ఉంది. పోనీ వటీరావుతో రాజీ చేసుకొంటే? చేసుకోకపోతే క్లబ్బుసైన్యం నామీదకు దండెత్తివచ్చి నన్ను హతమారుస్తుం దన్నమాట యీరోజున ధృవపడింది.

ఇంటిమొహం బట్టాను. వటీరావుతో రాజీ విషయమై సంప్రతించిచూద్దామనితోచింది. ఇంటికి వచ్చాను.

హోటల్నుంచి వచ్చిన అన్నం నేనొక్కణ్ణే ఈదురోమంటూ తిన్నాను. వటీరావువచ్చిన అలుకుడు అయింది. క్లబ్బులోనే భోజనం ముగించి వచ్చి ఉంటుంది. రావడంతోనే నేనుగానే యింట్లోఉన్నట్లయితే తలుపు బిగించుకొని బొంబాయి వీక్లిలో క్రాస్ వర్డు పజుల్సు సాల్వు చేస్తూ రాత్రి

పన్నెండు గంటలదాకా కూచోవడం అలవాటు. నేనప్పటికింకా యింటికి రాకపోతే నాకు హోటల్‌నుంచి వచ్చినఅన్నం బంట్రోతులకిచ్చి పొమ్మంటుంది. ఆరోజున నాకు నిట్రుపాసం అన్నమాట. ఈరోజు అట్టి అవస్థ పట్టలేదు. భోజనం ముగించి నెమ్మదిగా వటీరావు గదికేసి వెళ్లాను.

'మైడియర్ వటీ! వటీ' అని వటీరావు గది తలుపుదగ్గిర నిలబడి పిలిచాను.

సమాధానంలేదు. గదితలుపులు తెరవబడలేదు.

'వటీ, డియర్ ఓల్డుగర్ల్, తలుపుతియ్యి.'
సమాధానం లేదు.

'మై పీచ్, మై వైఫీ—తలుపు తియ్యవూ'
సమాధానం లేదు. కాని గదిలోనుంచి ఒక విధమైన శబ్దం బయలుదేరింది. ఆశబ్దం స్పష్టాకారం వహించి నా చెవులో ప్రవేశసరికి పరిణమించి పొందిన రూపం యిది—

'గెరవుట్, యూ బ్రూట్.'

ఇంక రాజీ ఏమిటి? సామోపాయం లాభం లేదనుకున్నాను. కష్టాలన్నప్పుడు అందరికీ ఒక్కటే కాబట్టి క్లబ్ మెంబర్ల భర్తలందరినీ సమావేశపరిచి పరిస్థితులు వెల్లడిచేసి వారి సలహాప్రకారం నడుచుకోవడం ఉత్తమమని తోచింది.

ఒకనాడు వటీరావు యింట్లోలేని సమయాన వారందరినీ మా ఇంట్లోనే సమావేశపరిచి మొదటినుంచీ జరిగిన సంగతులు సభలో నివేదించాను.

రేడియో ప్రసంగంవల్ల యింతముప్పు కలిగింది కాబట్టి అట్టి ప్రసంగాలు యికముందు చెయ్యకూడదని తీర్మానిస్తే బాగుంటుందని ఒక పెద్దమనిషి అన్నాడు. ఆసంగతి తరువాత ఆలోచించుకోవచ్చు. ముందునాకు కర్తవ్యమేమిటో చెప్పవలసిందని నేను కోరాను. డైవోర్సు ఉంటే ఈసందర్భాలలో ఎంతబాగుండేదో అని కొంతమంది వగచారు. నన్ను బ్రూట్, డెవిల్ అన్న మెంబర్ల భర్తలు తమ భార్యలవద్దనుంచి సంజాయిషీ తీసుకోవలసి ఉంటుందని చాలామంది అభిప్రాయపడ్డారు. చివరికి వారు నాకిచ్చిన సలహా: ఎంతమాత్రమూ లొంగవద్దని, ఎంతకాలమైనాసరే—వాళ్ళకు బుద్ధివచ్చే వరకు—యీ ధర్మయుద్ధం సాగించవలసి ఉంటుందన్నారు. నాకు కావలసిన సమస్త సదుపాయాలు తాము చేస్తామన్నారు. ఎట్టి యిబ్బందులలోనైనా నన్నువారు ఆదుకొంటామన్నారు. ఆరోజునుంచీ నన్ను హోటలుభోజనంమాని వారివారి యిళ్లలో భోజనం చెయ్యమన్నారు. సమావేశం ముగిసింది.

మగవాళ్ళు భోజనం వాళ్ళ వాళ్ళ యిళ్లలో చెయ్యమన్నారు కాని అది సాధ్యమా? ఏ యింట్లోనూ నాకు భోజనం దొరకలేదు. మెంబర్లందరూ చేసుకొన్న కట్టుబాటు అటువంటిది.

అంతే కాకుండా పురుషులమైన మేమంతా సభచేశామనీ, ఆ సభలో నాకు బుద్ధి చెప్పడం మాని వటీరావుదే తప్పుగా భావించామనీ, ఆవిధంగా ఆడవాళ్లను అవమాన పరిచామనీ మెంబర్లందరూ చెప్పుకోవడం మొదలుపెట్టారుట. వారివారి భర్తలు నాకు సహాయం చేస్తామన్నారు కాబట్టి అది సహించతగ్గ విషయం కాదనుకొన్నారుట. నా విషయంలో వారు సానుభూతిచూపారు కాబట్టి వారిభార్యలందరూ వారిమీద కినిశారు. కట్టుకట్టారు. వారికి తిండి పెట్టడం మానివేశారు. ఏ పాపమూ ఎరగని క్లబ్ మెంబర్ల భర్తలందరికీ నా అవస్థే పట్టింది. ఇంక చేసేదేమిటి ?

పరిస్థితులు దుర్భరమవడం వల్ల భర్తలందరూ నావద్దకు వచ్చి ఏదో ఒక విధంగా రాజీకి వప్పుకో మని నన్ను నిర్బంధించారు. లేకుంటే లాభంలేదన్నారు. ఇంతకీ ప్రణయ కలహాలజాతికి చెందిన విరోధం కాబట్టి యిట్టి సందర్భాలలో ఎట్టి షరతులైనా వప్పుకో వచ్చునన్నారు. సరే అన్నాను.

భర్తలు తమ భార్యలద్వారా రాయబారాలు వటీరావుతో నడిపారు. రాజీ షరతులు వ్రాసి యివ్వమన్నారు. స్నేహితురాళ్ల ప్రోద్బలం వల్ల వటీరావు రాజీషరతులు వ్రాసియిచ్చింది. అవి నాస్నేహితుల ద్వారా నాకు చేరినవి.

అవి యివి—

౧. వారం లోపుగా ఒక డైమండ్ బ్రూచ్ కొని యివ్వడం.

౨. నెల లోపుగా యిట్టి కలహాలు కల్పించకుండా సత్ప్రవర్తనతో మెలగడానికి ధరావతుగా అయిదువేల రూపాయిలు వటీరావు దగ్గిర ఉంచడం.

3. రోజూ యింట్లో సంధ్యావందనం చెయ్యకుండా ఉండడం.

౪. తాను వచ్చేవరకూ రాజీ జరిగిన మరునటిదినమునుంచీ తనకు నేను అలంకరణము యిదివరలో కోరిన ప్రకారం చెయ్యడం.

౫. ఇదివరలో చూపిన దుష్ప్రవర్తనకు వ్రాతమూలకంగా క్షమాపణయివ్వడం.

ఇవీ షరతులు— వప్పుకొన్నాను. వీటన్నింటికీ వప్పుకొన్నాను. వప్పుకోక చేసేదేమిటి? వప్పుకొన్నట్లు వ్రాసియిచ్చాను. క్షమాపణ పత్రము వ్రాతమూలకంగా సమర్పించుకొన్నాను. డైమండ్ బ్రూచికి ఆర్డరిచ్చాను. అయిదువేల రూపాయిలకు నా భార్యపేర చెక్కువ్రాసి యిచ్చాను. సంధ్యావందనం పొడిగా మనసులోనే చెయ్య సంకల్పించుకొన్నాను.

ఇక అలంకరణం మాటా ? ఇన్ని చేశాక అది మాత్రం తప్పుతుందా ? భక్తిశ్రద్ధలతో పాదరుపూతలు వగైరా లన్నీ పూస్తూ నేఉన్నాను.అందుకోసం ఒకఇంగ్లీషు విద్వాంసుడి దగ్గిర కొన్నిదినాలు పాఠాలు కూడా చెప్పుకొన్నాను. మసాజ్ - కాళ్లూ

వళ్లూ పట్టడం—కూడా ఒక ఎక్స్పర్టు దగ్గర నేర్చుకొని ఆచరిస్తున్నాను. మసాజ్ నిజానికి చాలా గొప్పవిద్య. మన పూర్వులు ఆచరించేవారని ఆ మధ్య ఒక ఆయుర్వేదభిషజ్మణి ఏ పత్రికలోనో వ్రాస్తే చదివినాను. కాళ్లు పట్టడం తప్పని భావించే వారికి పారిజాతాపహరణం చదవమని చెప్పడమే సరియైన హితబోధ. నవనవోన్మేషమైన సౌందర్యంతో పటీరావు ఇల్లంతా ఆనందం కురిపిస్తూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా చేస్తోంది. ప్రబంధకారులు చెప్పినట్లు ప్రణయకలహానంతరమే ప్రేమసుఖము. ఇట్టి ప్రేమసుఖ మెరగని వారు ఒక మారు భార్యలతో కలహించడం మంచిది.

# దీపావళి

## హనుమచ్ఛాస్త్రి

దీపావళీరాత్రి దివ్యశోభారాత్రి
ఒకకొత్త తెనుగుకవి ఊహాలను రగిలించి
కరుణజీవిత మధుర కావ్య మిచ్చినరాత్రి
తిమిరపరిరంభాల కుములు భారతజాతి
కొకనాడు వెలుగిచ్చి ఓదార్చు నిజధాత్రి
నిటారైట గుడిసెలోనికి సైత మెను రేగి
నిరుపేద పెదవులకు చెరకు నిచ్చినరాత్రి
స్నేహమిచ్చిన చివురు చేతి దీపపువెల్గు
తప్పిపోయినవాని దారిచూపే రాత్రి
ఎడదలో చీకటుల బెడదలో తడవుకొను
దీనదృష్టికి ప్రేమ దేవి నిచ్చినరాత్రి
దీపావళీరాత్రి దివ్యశోభారాత్రి

# పండుగనాడు

[సంక్రాంతి]

శ్రీరంగం నారాయణ బాబు

పాడాలట !

పాడాలట !

చలిచే

ఆకలిచే

విలపించే

ముష్టివాని రెక్కల మీదికి సం
తుష్టి కొరకు చింకిగుడ్డ
జీవన హేమంతపు చలికాగగ
కవులకు ఒకగీతం
కావాలట !
కావాలట !

ఆముదపు ప్రమిదలలో వెలిగే దీపాలు
హృదయంలో భావాలు
పండుగట !
పండుగట !

కాలిన ప్రేయసి దేహం
చమురుకంపు యీలోకం
పాడాలట !
పాడాలట !

—శరీరమె రామభజన సిమ్మాళ
గీతాల భక్తులు—
తిరువీధులు తిండికొరకు
తిరిగి తిరిగి యలసినారు
పండుగట ! డబ్బులు
మెండుగ దొరకునట !

గళమె నాదస్వరముగ
కాలమె ముందంజ వైచి
గంగిరెద్దు బ్రతుకు నాది
ముక్కున విధి తాడై వేలాడగ
పట్టి పట్టి లాగుతుంది
పాడాలట !
పాడాలట !

['రుధిరజ్యోతి' నుండి]

# ఆడవే! ఆడవే!!

బొద్దు బాపిరాజు

చిలిపికాళ్ళకు సొగసు తెచ్చిన కడాని
గజ్జియలు ఘల్ ఘలం ఘలాఘలలు పలుక
తోక పైకెత్తి గునిసి చిందులను ద్రొక్క
ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!

మసక ముసుగులు దుసికిలు పసరు సంజ
వెలుగులో మేని నింపులు చెలగ, వంచి
విడిచిన పిసాళి మల్లెపూ విల్లువోలె
ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!

పాలనురువుల మురువుల దేలు మోము
ముద్దు లడిగెడి చిన్నారి మూర్తి మెరయ
పాదు కదలి వచ్చిన హిమవంత మనగ
ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!

గాలి యీలల కదలు గంగా తరంగ
మొరగబోసిన వెన్నెల నురుగు తేట
యుసురు నిలిపిన నునువెన్న యసదుబొమ్మ
ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!

ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!
పొంగి చప్పట్లు చరచుచు చెంగనాల
నెగిరి మాపాప వెస కేగిరింతలాడ
ఆడవే! ఆడవే!! బుల్లి యావుదూడ!

# శాంతరసము

## తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు

భరతుడూ అతని అనుయాయులైన ఆలంకారికులూ వ్యభిచారిభావాలు అనిత్యములుగాను, స్థాయీభావాలు నిత్యములుగాను ప్రతిపాదించారు. రసం స్థాయిభావంవల్లనే నిష్పన్నమవుతుంది. మనపురుషార్థములకు సంబంధించిన రసమే పరమోత్కృష్టము. శృంగార, హాస్య, కరుణా, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుతములు ఎనిమిది రసములుగా సామాన్యంగా అంగీకరించినారు. అభినవగుప్తపాదులు అభినవభారతి ఆరోఅధ్యాయంలో ప్రతిరసాన్ని గురించి సమీక్షించారు. ఈ రసములన్నీ కొద్దిగానో గొప్పగానో ధర్మార్థకామములకు సంబంధించినవి. అదేవిధంగా మునియొక్క శాంతమైన చిత్తవృత్తి పరమపురుషార్థమైన మోక్షసంబంధమై ఆనందపర్యవసానమైన రసమునకు తోడ్పడుతున్నది. అదే శాంతరసము.

౧

శాంతరసము తొమ్మిదోరసంగా అంగీకరించేవారు శాంతరసస్థాయి శమ మని చెప్తారు. విభావాలు సంయమనిదిధ్యాసములు; అనుభావాలు కామక్రోధాది అరిషడ్వర్గములను జయించడం; వ్యభిచారులు ధృతి మతి ఇత్యాదులు. ఈ మతం భరతుడు చెప్పినదానికి విరుద్ధంకావడంవల్లచాలామంది అంగీకరించలేదు. భరతముని 48 భావాలు చెప్పినాడేగాని శమం ఉదాహరించలేదు. శమం భావంగా పరిగణిస్తే భరతుడు నిర్ణయించినసంఖ్య మీరి, 49 భావా లని అనవలసివస్తుంది. వనితాసన్నిధ్చందనాదులు, వెన్నెలలు, దక్షిణానిలము, కోకిలరవాలు 'రతి'ని ఉద్దీపితం చేసినట్లు, సంయమాదులు తత్త్వజ్ఞానం కలిగించడానికి ఉపయోగపడతవే గాని శాంతరసపుష్టికి తోడ్పడలేవు. అందువల్ల సంయమాదులు శాంతరసవిభావాలు కావు. కామక్రోధాదిరహితవ్యాపారములు అనుభావాలు కావు. రంగస్థలంలో కామక్రోధాదిరహితవ్యాపారం, చలనరహితమైనవృత్తి నటించడం కుదరదు.

ధృతిమతీత్యాదులు ఇంద్రియోపభోగానికి సంబంధించినవి; శాంతరసవ్యభిచారులు కావు. అందువల్ల శాంత మనేరసం లేదు.

## — అభినవగుప్తుల వాదము —

ధ్వన్యాలోకలోచనంలో అభినవగుప్తులు రసము లన్నింటిలోను పరమోత్కృష్ట మైన రసము శాంత మని ఘంటాపథంగా చెప్పినారు. ధర్మార్థకామము లనే మూడు పురుషార్థములను శాస్త్రములలోను, ఇతిహాసాలలోను ఎలాగ వివరించారో అదే రీతిగా నాలుగో పురుషార్థ మైన మోక్షప్రసక్తి కూడా ప్రతిశాస్త్రంలోనూ ఇతిహాసం లోనూ ఉంటుంది. రత్యాది స్థాయిభావాలు కవిసృష్టివల్ల, నటులవల్ల శృంగారాది రసములుగా నిష్పన్న మవుతున్నప్పుడు, అట్టి భావములు సహృదయుడిలో ఉపస్థిత ములై వ్యక్త మవుతుంటే అతను ఆశృంగారాది రసములను ఆస్వాదన చేయగలుగు తున్నాడు. అటువంటి సమయంలో పరమోత్కృష్ట మైన పురుషార్థ సంబంధి అయిన స్థాయిభావం, ప్రత్యేకరసంగా ఎందుకు నిష్పన్నం కాకూడదు? ఆరసం ఆస్వాదిం చేందుకు తగిన సహృదయు లుండరా? అందువల్ల స్థాయిభావం ఏ దైనప్పటికీ శాంత రసానికి ఒకస్థాయి ఉండవలసిన అవసరం ఉన్నది.

ప్రకృతంలో శాంతముయొక్క స్థాయిని నిర్ణయించవలసివుంటుంది. కొందరిమతం నిర్వేదం స్థాయిభావ మని. సాధనసంపత్తిలో చేరిన 'ఇహాఽముత్రఫలభోగ విరాగమే' నిర్వేదము. భరతముని స్థాయిభావాలచివర వ్యభిచారుల ఆరంభంలో నిర్వేదం ఉదాహరించాడు. కేవలవిరాగసంబంధ మైన నిర్వేదం మంగళప్రద మైనభావం కాదు. అటువంటిదాన్ని భరతుడు ఎందుకు చెప్పవలసివచ్చింది? తిన్నగా యోజిస్తే 'నిర్వేదం' 'ఇహాఽముత్రఫలభోగవిరాగమే.' తత్వజ్ఞానం పొందకపూర్వం నిర్వేదం కలగడం వాస్తవం. తత్వజ్ఞానం పొందినవాడికి మోక్షం కరతలామలకం అవుతుంది' గాని నిర్వేదం ఎప్పుడూ కలగదు. అందువల్ల శాంతరసస్థాయి నిర్వేదం కాదు.

ఎనిమిది స్థాయిభావాలలో ఏదో ఒకటి శాంతరసస్థాయి అవుతుం దని కొంద రాలం కారికులమతం. శృంగారానికి స్థాయి అయిన 'రతి' మోక్షప్రాప్తికి ఆత్మరతి'గా పరిణ మిస్తుం దన్నారు. అంతేకాక సమస్త మైన ఐహికబంధాలనుంచీ ముక్తుడు కావడానికి సాధన చేసేవాడికి ప్రపంచం హాస్యాస్పదంగానూ, క్షణిక మైన ప్రాపంచికసుఖాలకై తపించేవాళ్ళను చూస్తుంటే జాలి, వనితాదులు ఎంతచక్కగా కనపడుతున్నా క్రోధం జుగుప్స కలుగుతూంటవి. ఆత్మోన్నతికి విస్మయు డౌతాడు. ఇలాగ మోక్షకామి ఎనిమి దైనస్థాయిభావవాహినిలో ఈదులాడుతూ దరి జేరుతాడు. అందువల్ల ఎని మిదిస్థాయిభావాల్లో ఏఒకభావమో శాంతరసస్థాయి అవుతుంది. ఈమతం సరియైనది

కాదు. శృంగారాది అష్టకష్టాలకు ఎనిమిదిస్థాయిభావా లున్నవి. కానిశాంతరసాని
ఫలానిభావ మని నిర్ణయం కాలేదు. ఎనిమిదిస్థాయిభావాలూ శాంతానికే తోడ్పడు
తుంటే శాంతం ఒకరసం కాక అనేకరసాలు కావలసివుంటుంది. స్థాయిభావా లన్నీ
మోక్షప్రాప్తిగా పర్యవసితము లౌతవని అనవలసివస్తే,అప్పుడువీరరౌద్రరసాలుకూడా
ఒకటిగా అంగకరించవలె.కొందరిమతం అన్నిస్థాయిభావాలకలయికే ఒకస్థాయిగాపరిణ
మిస్తుం దని. ఈ మతంకూడా తృప్తికరం కాదు. అన్నిస్థాయిభావాలు ఏకకాలంలో
ఉండడం అసంభవం. శృంగారరసస్థాయి అయిన 'రతి' బీభత్సస్థాయి అయిన'జుగుప్స'
ఈరెండూ ఒకసారి సామరస్యం పొందనేపొందవు. అందువల్ల పైని చెప్పినమతం
సరి కాదు.

అనారోపితమైనపదార్థజ్ఞానం, తత్త్వజ్ఞానం. తత్త్వజ్ఞానంవల్ల మోక్షంప్రాప్తమవుతుంది.
ఈతత్త్వజ్ఞానమే ఆత్మజ్ఞానం. కోరిక లన్నిటినుంచీ ముక్తుడై శుద్ధచైతన్యంతో చిదా
నందమూర్తి ప్రకాశించే ఆత్మావస్థ స్థాయిభావం అవుతుంది. రత్యాదులవలె స్థిరము
లైనవిమాత్రమే కనుక ఆత్మజ్ఞానాన్ని స్థాయి అనడంలేదు. నిత్యమైనఆత్మలోఎప్పుడు
పడితే అప్పు డీస్థాయి వ్యక్తమవుతూవుంటుంది. కాని స్థాయిభావా లన్నింటికి
మూలం తత్త్వజ్ఞానం. గోడమీద బొమ్మలు వేలాడదీసినట్టు తత్త్వజ్ఞానకుడ్యంమీద
భావా లనేచిత్రాలుంటవి. అందువల్ల ఆత్మజ్ఞానమే పరమోత్కృష్ట మయినస్థాయి
భావం. అందులోనే నిత్యము లైన రత్యాదిస్థాయిభావాలు ఉద్దీపనాలుగా ఉంటవి.
అందువల్ల భరతుడు ప్రత్యేకంగా దీనిని చెప్పవలసిన అవసరంలేదు.

ఆత్మజ్ఞానమే స్థాయిభావం అనేమతం భరతమతానికి విరుద్ధం కాదు. అప్పుడు భరతుని
49 భావాలకు ఏ ఆక్షేపణా వుండదు. అదీగాక రసాలను చెప్పినతర్వాత భరతుడి
అభిప్రాయం వ్యభిచారులను కూడా ఉదహరించవలె ననే గాని స్థాయిభావాల నని
కాదు. స్థాయిభావాలు కూడా వ్యభిచారులపనే చేస్తవి కాబట్టి వ్యభిచారులుగానే
భరతాచార్యుడు చెప్పాడు. లేకపోతే భావా లన్నీ 49 అని ఒక్కముద్ద చేసి చెప్ప
వలసిన అగత్యం ఏ ముంటుంది? ఈ తత్త్వజ్ఞానం దేనికీ ఉద్దీపనవిభావం కాదు. తత్త్వ
జ్ఞానమే ఆత్మకు సహజస్వభావం. దానికే, భరతుడు 'శమ' మని పేరు పెట్టా డని
అభినవగుప్తులు 'లోచనం'లో అన్నారు. (ప్రతీయత ఏ వేతి- మునినా వ్యంగ్యక్రియత
ఏవ 'క్వచి చ్ఛమః' ఇత్యాది వదతా) ఆత్మ ఉపాధితో వున్నప్పుడు రతి, క్రోధాది
భావములు వ్యక్తమవుతవి. కాని ఆత్మయొక్క అబాధ్యమైనశుద్ధస్వరూపమును
తెలుసుకొన్న మునిచంద్రుని నిశ్చలమైన ధ్యానము శమమే. కులదేవతానుగ్రహం

విభావం; రత్యాదిభావములు వెంటనే నశించిపోతవి. విప్రలంభంలో ఔత్సుక్యంవలె ఇక్కడ విరాగము ముఖ్యంగా ప్రవర్తిస్తుంది. ఆత్మజ్ఞాని ఇతరులమేలుకోసం యత్నిస్తాడు; ఇతరులకోసం స్వార్థపరాఙ్ముఖు డౌతాడు. త్యాగం ఇతనిలో మూర్తీభవిస్తుంది. అందుకే కొందరు శాంతరసాన్ని ధర్మవీర, దయావీర రసాలుగా పరిగణించారు. శాంతరసం దయావీరానికిగాని ధర్మవీరానికిగాని వ్యతిరేకరసం కాదా అనే ప్రశ్న రాక తప్పదు. దయావీరరసములు అహంకారసంబంధములు; శాంతరసంలో నిరహంకారము ముఖ్యము. పరస్పరవ్యతిరేకభావాలుకూడా వ్యభిచారులుగా ప్రవర్తిస్తవి. శృంగారస్థాయి రతికి వ్యభిచారిభావం నిర్వేదం నిరహంకారంతో అని అన్నప్పటికీ అహంకారజన్యమైన ఉత్సాహం కేవలం అభావంగా ఉండదు. కోరిక లేమీ లేని ఆత్మజ్ఞానానికి మోక్షప్రసక్తి తప్ప ఇతరప్రవృత్తి వుండదు. శరీరంమీద అభిమానం పోతుంది. పరోపకారార్థం శరీరం త్యాగం చేస్తాడు. అటువంటి త్యాగప్రవృత్తి శాంతరసవిరుద్ధం కాదు. 'ఆత్మానం వా గోపాయేత్' వంటి ధర్మాలు ఆత్మజ్ఞానం లేనివారికిగాని జ్ఞానికి కాదు. దేహాత్మజ్ఞానం కలవాడు, తన ఉపాధిని ఇతరుల మేలుకోసం అర్పిస్తాడు. శ్రీహర్షవర్ధనకృత 'నాగానందము'లో జీమూతవాహనుడు పరివ్రాజకుడు కాకపోయినా ఆత్మజ్ఞానం కలవా డని స్పష్టం. ఆ నాటకంలో రసం శాంతము. చివరకు శంఖచూడుణ్ణి రక్షించడంకోసం నాయకుడు తనప్రాణాలు వదిలివెయ్యటానికి వధ్యశిలదగ్గిరికి వస్తాడు. గరుత్మంతుడు ముక్కుతో పొడిచి కండలుతీస్తున్నా, జీమూతవాహనుడు ఒక్కనిట్టూర్పుగాని, ఒక్క కన్నీటిచుక్కగాని వదలని మహాత్ముడు. గరుత్మంతుడే ఆశ్చర్యపడి 'ఎవరా ఈ మహానుభావుడు' అనుకొని, ముక్కుతో రక్కక ఊరుకొనేసరికి జీమూతవాహనుడు ఇలా అంటాడు.

'సిరాముఖైః స్యందత ఏవ రక్తమ్
అద్యాపి దేహే మమ మాంస మస్తి,
తృప్తిం న పశ్యామి తవేహ, తావత్
కిం భక్షణా త్త్వం విరతో గరుత్మన్.'

శాంతశృంగారాలు అంత కేవలం పరస్పర వ్యతిరేకరసాలు కావు. శాంతశృంగారాల మధ్య ఏదో ఒకరసం అంగముగా ఉంటే వైరుధ్యం పోతుంది. నాగానందంలో శాంత శృంగారాలమధ్య ఏర్పడ్డ అఖాతం కప్పిపుచ్చడానికి అద్భుతరసం వచ్చి చేరింది. దశరూపకకారుడు ఎంత కాదన్నా ఇందులో వున్నరసం శాంతమే.

నాట్యశాస్త్ర పూర్వప్రతుల్లో శాంతరసంగురించి ఉన్నట్టు అభినవగుప్తులు చెప్పి నారు. శాంతరసం అనే అఖండమైనరసం ఉన్న దనీ, దానిస్థాయి శమ మనీ, ఇంద్రి యోపభోగరహిత మైన దనీ, ఈ శాంతరసమే నానారూపాలతో శృంగారాది వికారములుగా గోచరమవుతూ ఉంటుందనీ, అన్నిరసాలకూ మూలకందము శాంతమే అనీ భరతుడు చెప్పనే చెప్పాడు.

'తస్మా దస్తి శాంతో నామ రసః । తథా చ చిరంతన పుస్తకేషు స్థాయి భావాన్ రసత్వ ముపనేష్యామః ఇత్యనంతరం శాంతో నామ శమస్థాయిభా వాత్మ కేత్యాది శాంతలక్షణం పఠ్యతే'

సముద్రంలో తరంగాలు పుట్టి తిరిగి సముద్రంలోనే లీన మైనరీతిగా అఖండమై ఏక మైన శాంతంలో ఉద్భవించిన రసములు చివరకు శాంతంలో లీన మవుతవి.

'స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతా ద్భావః ప్రవర్తతే
పున ర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రలీయతే.'

రసములు తొమ్మి దని అందరూ అంగీకరించారు. ఈ రసాలు సుఖపర్యవసాయాలు మాత్రమేకాక పురుషార్థానికికూడా సంబంధించినవి. కొన్ని అవాంతరరసము లైన 'స్నేహ' 'వాత్సల్య'ములు 'రతి'కింద చేర్చడానికి ఆక్షేపణ వుండదు. అభినవ గుప్తుడు ప్రజ్ఞతో కౌశలంతో వాదబలంతో సత్యదృష్టితో శాంతరసోత్కృష్టత నిరూపణ చేసి ఆలంకారికలోకమూర్ధన్యు డైనాడు.

# వరాగమనము

## నోరి నరసింహశాస్త్రి

▽

అంకితము

లక్ష్మీ సుబ్రహ్మణ్యులకు

△

పాత్రలు: తల్లి - తండ్రి - వధువు - వరుడు

= తల్లి =

అప్పుడే అంత తొందర ఏమి వచ్చెనండీ!

= తండ్రి =

నా దేమున్నది? నీ ఇష్టము, నీ కూతురి ఇష్టము, నీ అల్లుడి ఇష్టము!

[దూరాన మంగళ తూర్యరవములు విన వస్తవి. అలంకరించుకుంటున్న వధువు ఉత్కంఠతో ఆ గదిలోకి వచ్చి కిటికీలోనుంచి బయటికి చూస్తుంది]

= తల్లి =

[కఠినంగా] అమ్మాయ్!

= వధువు =

[ఉలికిపడి] ఏమమ్మా!

= తల్లి =

ఏంజేస్తున్నావే అక్కడ?

= వధువు =

కనపడడం లా జడ వేసుకుంటున్నది—

= తల్లి =

జడ లోపల వేసుకోరాదు టే! ఈ ఇంట్లోకి ఎందుకే!

= తండ్రి =

చిన్నపిల్లమీద అంత అధికారం మొదుకుతూ? [చిరునవ్వుతో] పెళ్ళికొడుకువారి మేళం విందామని వచ్చింది కాబోలు!

= తల్లి =

ఉండండి మీరు మరీ!

= వధువు =

[సిగ్గుతో] చూశారా, చూశారా మరి! నేను అక్కడ చెమటపోస్తుంటే చల్లగాలికి ఈ గదిలోకి వస్తే, చూశారా మరి ఏమం టున్నారో!

= తల్లి =

ఇంట్లోకి వెళ్ళవే అమ్మా!

= వధువు =

[తల విసురుకుంటూ ఇంట్లోకి వెళుతూ] వెళుతున్నారు లెద్దూ! మహా...

= తల్లి =

ఎందు కమ్మా అంత తల విసురుడు! ఇంతకూ నిన్ను అని ఏమి లాభము. అంతా మీ నాన్నగారు చేస్తున్నారు!

= తండ్రి =

మధ్య నే నేం జేశాను?

= తల్లి =

పసిపిల్లకదా, అత్తవారింటికి వెళ్లి ఎట్లా ఉండ గలదండీ!

= తండ్రి =

ఆడపిల్ల ఐనప్పుడు అత్తవారింటికి ఎప్పుడో పంపక తప్పుతుందా?

= తల్లి =

నేను మాత్రం అత్తవారింటికి పంప వద్దన్నానా? పోనీ శ్రావణమాసము వస్తున్నది కదా, నోములు ఇక్కడ నోయించి ఐనా పంపుదా మని అండీ! మీకు ఆడపిల్లగదాఅని ఒక ముచ్చటే లేకపోయె!

= తండ్రి =

నిజమే, లేకపోవడమేం? శ్రావణమాసంలో ముఖ్యంగా ఆడపిల్లల నోములు, ఆ తర్వాత వినాయకచవితి. ఆ పిమ్మట నవరాత్రులలో మన పూజలకు ఆడపడుచు ఇంట్లో ఉండవలె. తర్వాత దీపావళి. దీపాలు వెలిగిస్తూ ఆ వెలుగులో అమ్మాయి ముఖం చూస్తే ఎంతో ముచ్చటగా నక్షత్రాలలో చంద్రబింబమల్లే ఉంటుంది. ఆ పైన సంక్రాంతిఆయె, బొమ్మలపండగే ఆయెను. ఇంతలో శివరాత్రి. దేశదేశాల జనమూ కోటీశ్వరుడి తిరణాలకు ఇక్కడికి వస్తుంటే అమ్మాయిని ఎట్లాపంపుతాము! ఈలోగా సంవత్సరాది వస్తుంది. ఆ రోజు ఇంట్లో పుట్టిన ఆడపిల్ల ఇంట్లో లేకుండా అత్తవారింట్లోఉంటే ఎట్లా!

= తల్లి =

అవునండీ మరి!

= తండ్రి =

అయితే మరి అమ్మాయిని అత్తవారింటికి పంపే దెప్పుడు?

= తల్లి =

అదుగో,-నేను అత్తవారింటికి పంపవద్దన్నానండీ, పండగదాకా ఉంచమన్నానుకాని.

[వధువు అలంకరించుకొని వచ్చి తండ్రి వద్ద పరధ్యానంగా కూచుంటుంది.]

= తల్లి =

[కఠినంగా] అమ్మాయ్!

= వధువు =

[విసుగుతో] ఏమిటే అమ్మా, అట్లాఉలిక్కిపడేట్లు కేకలు వేస్తావు!

= తండ్రి =

ఎందుకూ అట్లా కేకలు వేస్తావు? అత్తవారింటికి పంపేమాటలు మనము మాట్లాడుకుంటూంటే సరదాగావిందామని వచ్చింది. దాన్ని కేకలువేస్తావేం?

= వధువు =

చూశారమ్మా, ఏమి ఎక్కిరింపండీ మీదగ్గర కాస్తసేపు కూచోవలె నని వస్తే!

= తల్లి =

తమ్ముడికి కాస్త తల దువ్వి బొట్టు పెట్టవే, లోపల పిలుస్తున్నాడు. చెల్లెలు లోపల ఆగం చేస్తున్నది. వాళ్ళ సంగతి చూడవే. ఇట్లాంటి దానివి అత్తవారింట్లో కాపురం ఎట్లా చేస్తావే!

= తండ్రి =

ఇంతకూ పెద్దకూతురు నీ ఇంట్లో చాకిరికి లేకుండా వెళ్తున్నదని నీ దిగులువలె ఉన్నదే.

= తల్లి =

నా రెక్కలు బాగా ఉండగా నా కెవరూ చాకిరి లేయక్కరలేదు. కూతురిని అత్తవారింటికి ఎప్పుడు పంపుదామా అని మీకే తొందరగా ఉన్నట్లున్నదే.— లోపలికి వెళ్ళవుటే?

= వధువు =

[పరధ్యానంగా] ఆ పంచమస్వరంలో పాడే వేమిటి నాన్నగారూ?

= తండ్రి =

అవా? దూరాన కోయిలపెళ్లికొడుకు 'రా, రా' అని పిలుస్తూఉంటే, మనదొడ్లో మామిడిచెట్టు మీద కోకిలపెళ్లికూతురు 'ఊఁ, ఊఁ' అని పలుకుతున్నదే, తల్లీ!

[వధువు సిగ్గుతో లోపలికి వెళ్తుంది]

= తల్లి =

[బతిమాలుతూ] మీరు చెబితే అతను వింటాడండీ!

= తండ్రి =

ఏ మని చెప్పేది?

= తల్లి =

శ్రావణమాసందాకా అమ్మాయిని ఇక్కడ ఉంచ మందురూ!

= తండ్రి =

ఎట్లా?

= తల్లి =

ఏం?

= తండ్రి =

అతను ఉద్యోగధర్మంలో ఉన్న ఇబ్బంది చెప్పలా? అతనితో ఉంచ మని ఎట్లా చెప్పనో నీవే ఆలోచించు!

=

ఎట్లా ఏ మున్నది. గట్టిగాచెప్పండి! ముందు అల్లుడికంటే మిమ్మును బతిమాల వలసి వచ్చిందే?

= తండ్రి =

నేను చెబితే వింటాడని నీకు బాగా నమ్మక మేనా?

= తల్లి =

ఆఁ!

= తండ్రి =

ఇట్లా అసందర్భపుమాటలు చెప్ప మొదలు పెట్టితే నామీద అతనికి గౌరవము ఎంత కాల ముంటుంది?

= తల్లి =

ఉండకే మవుతుందేమి! అయినా ఎప్పుడూ చెబుతారా ఏమిటండి ? ఈ ఒక్కసారేగా. ఇంతలోకే మీ గౌరవ మంతా పోదులెండి నాదీభారం.

= తండ్రి =

పోనీగాని అమ్మాయికి ఇక్కడఉండవలెనని ఉన్నదో, అల్లుడితో కలిసి వెళ్ళవలెనని ఉన్నదో కనుక్కున్నావా?

= తల్లి =

దాని కేం తెలుసునండీ పసిపశువు!

[వధువు మళ్లీ గదిలోకి వచ్చి తల్లి ఒళ్ళో కూచుంటుంది]

= వధువు =

నాన్నగారూ, ఆ చిలకలదండు చూడండి. ఎట్లా కిలకిల మంటున్నాయో ఆ చిలకలు!

= తండ్రి =

అవునుతల్లీ! మా అల్లుడు మాతల్లిని తీసుకు వెళ్ళడానికి వస్తే మేళం చేయడానికి వసంతుడు పంపినాడమ్మా వాటిని.

[వధువు తలవంచుకుంటుంది]

= తల్లి =

మీ కవిత్వాలూ మీ అమ్మాయి కవిత్వాలూ అత్తవారింట్లో చాకిరి చేసేప్పుడు తెలుస్తాయిగాని...ఏమంటారు మరి!

= తండ్రి =

పిల్లవెంట పంపవలసిన వస్తువు లన్నీ సిద్ధం చేశావా ?

= తల్లి =

అంతా సిద్ధముచేయకపోతె మీరు వద్దూ! అయితే మీరు అమ్మాయిని ఉంచ మని అడగరా ?

= తండ్రి =

ఆహాఁ!

= తల్లి =

పిల్లను ఎప్పు డెప్పుడు పంపుదామా అని మీకే తొందరగా ఉన్నదాయె మరి అల్లుడికంటె !

= తండ్రి =

అవును !

= తల్లి =

మీ రడక్కపోతే పోనీ నేనే అడుగుతాను నన్నేం చంపుతాడా! నా కేం భయం లేదు. గౌరవం పోతుం దట. నా కేం పోదు. నేనే అడుగుతాను.

= తండ్రి =

అది నీ ఇష్టము!

[తూర్యారావములతో అల్లుడు వస్తాడు. అల్లుడూ కూతురూ తల్లిదండ్రులకు పాదాభివందనము చేస్తారు.]

= తండ్రి =

[అక్షతలు శిరస్సుల ఉంచుతూ] దీర్ఘాయుష్మాన్ భవ !— దీర్ఘసుమంగలీ భవ !

= తల్లి =

[అక్షతలు వేస్తూ మూతివిరిగించి] ఇప్పుడే అమ్మాయిని తీసుకు వెళ్లవలసిందేనా ?

[వరుడు సందేహంతో మామగారి వంక చూస్తాడు. ఆయన తల వంచుకుంటాడు.]

= వరుడు =

[వధువు ఎడమ చేయి పట్టుకొని] సెలవు తీసుకుంటాము.

= తండ్రి =

శుభం భూయాత్ !

[తల్లి కూతురిని కౌగిలించుకొని కంటనీరు పెడుతుంది. వధూవరులు తూర్యారావ పురస్సరంగా నెమ్మదిగా నిష్క్రమిస్తారు. తల్లి వారితో గుమ్మందాక వెళ్ళి వస్తుంది. తండ్రి వెక్కి- వెక్కి- ఏడుస్తూ ఉంటాడు]

= తల్లి =

ఏమిటండీ ఇది, శుభమా అని పిల్లను అత్త వారింటికి పంపుతూంటే ?

= తండ్రి =

నిన్ను పుట్టింటినుంచి తీసుకువచ్చినరోజున మీ అమ్మా మీ నాన్నా ఎంత ఇదైనారో జ్ఞాపకం ఉందా ? వాళ్ళను ఏడిపించినందుకు మన కిది శిక్ష !

= తల్లి =

బాగానే ఉంది. అట్లా ఏడవగూడ దండీ !

= తండ్రి =

తపోధనుడైన ఆ కణ్వ మహర్షికే తప్పింది కా దీదుఃఖము. అయినా ఇది ఏడుపు కాదు, ఆనంద బాష్పాలధార!

"అర్థోహి కన్యా పరకీయ ఏవ
తా మద్య సంప్రేష్య పరిగ్రహీతుః
జాతో మ మాయం విశదః ప్రకామం
ప్రత్యర్పిత న్యాస ఇ వాంతరాత్మా"

≡ తెర ≡

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## [విమర్శనము]

**గిడుగు వెంకటరామమూర్తి**

రెండేండ్లక్రిందట ఈ పత్రికాసంపాదకులు తెలికిచర్ల వెంకటరత్నంగారు ఈ గ్రంథము విమర్శించుమనిచెప్పి ఒక ప్రతి నా కిచ్చినారు. ఉత్సాహముతో ఆ పని చేయడానికి పూనుకొన్నాను. రెండు మూడు మాసములు, అప్పుడప్పుడు అక్కడక్కడ గ్రంథము చదువుతూ విమర్శమునకు కావలసిన సామగ్రి కొంత సంగ్రహించినాను. అదే పెద్ద గ్రంథమునకు చాలినంతదిగా కనబడినందున ఆపని అట్టేపెట్టి, సంగ్రహించిన సామగ్రి పరిశీలించడానికి మొదలుపెట్టినాను. అప్పుడు నాకు జ్వరము వచ్చినది. జ్వరము వదిలిన పిమ్మటనైనా స్వస్థత కలగలేదు. వార్ధక్యమువల్లను అస్వస్థతవల్లను ఏ పని చేయడానికైనా ఓపిక లేకపోయినది. పత్రికా సంపాదకులు నిఘంటు విమర్శనము గురించి తరుచుగా నాకు జాబులు వ్రాసినారు. ఏదో ఒకవిధముగా కర్తవ్యము కడతేర్చవలెనని ముఖ్యమైన విషయములు మాత్రము ఎత్తుకొని, యథోచితంగా వివరిస్తూ గ్రంథములోని గుణదోషములు, నాకు తోచినట్లు నిరూపిస్తున్నాను.

2. ఇది "పండిత సాహాయ్యమున జయంతి రామయ్యపంతులుగారిచే రచింపఁబడి, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే ప్రకటింపఁబడినది" అని ముఖపత్రముమీద కనబడుతున్నది. పంతులుగారు నాకు మిత్రులు; నామీద వారికి చాలాదయ గలదు; నాకున్నూ వారియెడల మిక్కిలి అనురాగ మున్నది. వారు రచించిన గ్రంథము నేను విమర్శించినప్పుడు నాకు కనబడ్డ గుణములేకాక, దోషములుకూడా ప్రకటించక తప్పదు. విమర్శన మనగా గుణదోషనిరూపణముగదా. నిర్మొగమాటముగా దోషములు నేను ప్రకటించకపోతే, నన్ను నమ్మి ఈ పనియందు నన్ను నియోగించిన ఈ పత్రికా సంపాదకులనేకాక లోకాన్నికూడా వంచించినవాణ్ణి అవుతాను. *

* దోషములు చూపించడమే దోషమని కొందరు అంటారు; కాని దోషములు చూపించక, కప్పడమే దోషమని నా అభిప్రాయము. దోషములు చూపించినవారే లోకానికి మేలుచేసినవా రవుతారు. దోషములు కనుకోఁగలవాడే పండితుడు. ("విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః" ఇత్యమరః) ఆంధ్రంలో పండితులని పేరుపొందినవారు, కొందరు తమ గ్రంథంలోని తప్పులు తామే కనుకోఁలేరు; కొందరు తాము తప్పులు లేకుండా గ్రంథం రచించగలిగినా, ఇతరుల గ్రంథాలలోని తప్పులు కను

'నానృతాత్ పాతకమ్ పరమ్'గదా. 'శతోఽపి గుణావాచ్యా దోషావాచ్యా గురోరపి' అన్నారు పెద్దలు. గనుక 'ఋతంవదిష్యామి సత్యంవదిష్యామి మావిద్విషావహై శాంతిః శాంతిః శాంతిః' అని సప్రణామముగా పంతులవారికి మనవిచేసి, ప్రస్తుతము అనుసరిస్తాను.

3. "ఈ గ్రంథము జయంతి రామయ్యపంతులుగారిచే రచింపఁబడినది" అనే వాక్యములో "రచించు" శబ్దమునకు అర్థమేమిటి? అని కొందరు నన్ను అడిగినారు. 'యాస్కుఁడు నిరుక్తము రచించినాఁ డంటారు. తర్కవాచస్పతి వాచస్పత్యం రచించినాఁ డంటారు. వారివలెనే పంతులుగారు ఈనిఘంటువు స్వయంగా రచించిఉంటారనుకోను. నిఘంటు నిర్మాణక్రతువు వీరి యాజమాన్యమున జరిగింది. పండితులు ఋత్విజులవలె దక్షిణలు పుచ్చుకొని, చేయవలసిన కర్మఅంతా చేసినారు. ఎవరు ఏపనిచేసినా పేరు వీరిది; పూచీ వీరిది. గ్రంథంలోని దోషాలకూ లోపాలకూ ఉత్తరవాదులు వీరే. నిఘంటువు ప్రకటించిన పరిషత్తుకు దీనితో ఏ సంబంధమూ లేదుగదా' అన్నాను.

4. వీరు ఈ నిఘంటువు స్వయంగా రచించలేదని నే నెందుకు అన్నానో మనవిచేస్తాను. (1) వీరు రచించిన గ్రంథాలలో వీరు ప్రయోగించిన శబ్దాలు ఈనిఘంటువులో చేరలేదు. ఉత్తరరామచరితములో 'ఏమిటి' అనే శబ్దము తరుచుగా వీరు వాడినారు:— "ఆర్య! ఇది యేమిటి?" (పుట 15), "అది యేమిటో కనిరమ్మ" (26), "రామునిమీఁదఁబడిన దేమిటి?" (43), "ఇదేమిటి?" (90, 95). వీరు గ్రంథనిర్మాతలయి ఉంటే, ఈ శబ్దము 'గ్రామ్య'మని విడిచి ఉందురా? ఈ నిఘంటువులో కవిప్రయుక్తములే కాక, కేవలము వాడుకలోని శబ్దములు ('వా' 'వ్యవ' అనే సంజ్ఞలుగలవి) అనేకముగా ఉన్నవి; గాని "గ్రామ్య" శబ్దములు ఏవీ చేరలేదు. "గ్రామ్యపదములను బరిహరించితిమి" అని పీఠికలో 'గ్రంథనిర్మాణపద్ధతి' వివరించిన భాగములో పంతులవారే వ్రాసినట్లు వారి సంతకమున్నదే! (చూ. పీఠిక పు. 9.) వీరు వాడిన 'ఏమిటి' గ్రామ్యమా? నేడు శిష్టవ్యవహారములో

...లేరు; కొందరు తప్పులుకానివి తప్పులని నిందించి పరాభూతులవుతారు; కొందరు ఇట్టి పరాభవము కలుగుతుందన్న భయమువల్ల అయినదీ కానిదీ మెచ్చుకొని మంచివారని ప్రఖ్యాతిపొందుతారు; అనేకులు మౌనమే భూషణమన్నట్లు పట్టి మందహాసము చేస్తారు. ఈ విషయములన్నీ అనేక సభలలో వ్యక్తమయినవి. నేను సర్వజ్ఞుణ్ణి అని అనుకొనేటంత అవివేకినికాను. ప్రాచీనాంధ్రభాషాలక్షణం అంతా తెలిసినవారెవరైనా ఉన్నారేమో నేనెరుగనుగాని, నాకు తెలిసినది అత్యల్పము. అది తెలియచెప్పడము నాకు విహితకృత్యము. నహిప్రవక్తు మిచ్ఛన్తి మృషాహితైషిణః.

లేని 'ఏటిది' గ్రాహ్యమా!(2)'ఏఁగు' శబ్దము, అరసున్న లేకుండానే, శబ్దరత్నాకరమం దున్నది. పంతులవారు తాము ఆంధ్రీకరించిన చంపూరామాయణములోనే ఇంచుమించుగా 50 సార్లున్ను, అమరుకములో మూడు నాలుగుసార్లున్ను, ఉత్తరరామాయణములో ఆరుసార్లున్ను, శబ్దరత్నాకరములో ఉన్నట్లే 'ఏగు'అని నిర్బిందుకముగానే ప్రయోగించినారు. ఇప్పటికి నూటికి తొంభై- తొమ్మండుగురు పండితులు (కవులు) ఇదే సాధువను కొంటున్నారు. వావిళ్ళవారు మొదలయినవారు ముద్రించిన భారతాది గ్రంథములలో కూడ ఈశబ్దము ఇట్లేఉన్నది. అయితే, నన్నెచోడని కుమారసంభవము పరిష్కరించి ప్రకటించిన శ్రీరామకృష్ణకవిగారు IV 461 లో 'ఏఁగు' అరసున్నతో వ్రాసి, పుట అడుగున, భోజరాజీయములోనిది ఒకపద్యమున్ను ప్రభావతీ ప్రద్యుమ్నములోనిది ఒకపద్యమున్ను అందుకు ప్రమాణముగా ఉదాహరించినారు. సూర్యరాయ నిఘంటువులో పంతులవారికి "సాహాయ్యము" చేసిన పండితులెవరో, తాము వెదకి కనుక్కొన్నట్టుగా, రామకృష్ణకవిగారుదాహరించిన ప్రయోగాలే ఎత్తుకొని, "శ. ర. నిర్బిందుకముగా గ్రహించెను. కాని యీక్రింది సాధక ప్రయోగములఁ బట్టి సబిందుకముగా గ్రహించితిమి" అని 'పరా' వ్రాసినారు. ఈవాక్యములో "గ్రహించితిమి" అనే క్రియకు కర్త అయిన 'మేము' అనే శబ్దముచేత నిర్దిష్టులయిన వారిలో 'ఏగు' అని నిర్బిందుకముగా ఈశబ్దము వాడిన రామయ్యపంతులవారుచేరి ఉన్నారని చెప్పగలమా? తమ మతం మార్చుకొన్నారని అయినా ఊహించలేము. సూర్యరాయ నిఘంటువులో 'ఏఁగు' సబిందుకముగా ఉన్నదని వారికి తెలియనే తెలియదు. ఈలాగున నేననడానికి కారణములేకపోలేదు. చిత్తగించండి; మనవి చేస్తాను.

5. నిఘంటువు అచ్చు పడ్డతర్వాత, రాజమహేంద్రవరములో నన్నయభట్టారక సమాజమువారు 1936 సం॥రం ఆగష్టు తే 4 దిని సమకూర్చిన ఒకసభలో, నన్నయ భారత పరిష్కరణమునుగురించి నేను ప్రసంగిస్తూ, ఈ 'ఏఁగు' శబ్దములో అరసున్న ఉండవలెనని పరిష్కర్తలకుగాని శబ్దరత్నాకర కర్తకుగాని తెలియదని చెప్పినాను. ఆసభకు అధ్యక్షులుగా ఉన్న మన జయంతి రామయ్యపంతులుగారు, వెంటనే లేచి, "అరసున్న ఉన్నదనుటకు ప్రమాణమేమిటో?" అని సాటోపంగా ధర్షించినారు. ఆశబ్దములో అరసున్న ఉండదని నిశ్చయంగా ఉపన్యసించినారు కూడాను. పండితులనేకు లాసభలో అప్పుడున్నారు. సమాజకార్యదర్శులు శ్రీనండూరి బంగారయ్యగారికిన్నీ, శ్రీవడ్డాది అప్పారావుగారికిన్నీ ఇంకామరి కొందరికిన్నీ ఈవిషయము

జ్ఞప్తియందున్నది. పంతులవారి గ్రంథాలలోని మాటలలో, ఈనిఘంటువున చేరనివి ఇంకా అనేకము ఉన్నవి. దీనిని బట్టి రామయ్యపంతులువారు ఈనిఘంటువు స్వయంగా నిర్మించలేదని నిశ్చయించవలెను గదా. అయితే, ఈపనిలో యాజమాన్యమో ఆధ్వర్యవమో వహించిన వారు గనుక అన్నిటికీ ఉత్తరవాదులు వారే.

6. నావిమర్శములో, అనుషంగికముగా ఈ నిఘంటు నిర్మాణచరిత్ర సంగ్రహముగా చెప్పవలసి ఉన్నది. 1911 న సంవత్సరమున బడులలో విద్యార్థులు వ్యావహారికాంధ్రమున రచనాభ్యాసము చేయడమునకు విద్యాధికారులు అనుమతించినారు. అది కొందరికి అయిష్టమయినది. ప్రాచీనాంధ్రగ్రంథములలోనిభాష వాడుకలో లేనందుచేతను, ఆభాష నేర్చుకోవడమునకు కావలసిన వ్యాకరణముగానీ, నిఘంటువుగానీ సంపూర్ణమైనది లేనందు చేతను, పండితులకైనా ఆభాషఅభ్యసించడం దుష్కరముగా ఉన్నదని అప్పుడు నావంటివాళ్లు వాదిస్తే, ప్రతిపక్షులలో ధనికులు కొందరు గ్రాంథికాంధ్రభాషాభిమానము గలవారు, సద్భావముతోనే, వ్యావహారికభాష వ్యాపించకుండా చేయడము కోసము ఈ 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' ప్రతిష్ఠాపించినారు. వ్యావహారికభాష గ్రామ్యము గనుక దానిని త్యజించవలెను; గ్రాంధికభాష నెలకొల్పవలెను. అది ఆంధ్రులందరూ నేర్చుకోవడము సుకరముగా చేయడానికి సంపూర్ణమైన నిఘంటువూ, సంపూర్ణమైన వ్యాకరణమూ, భాషారచన సమగ్రముగా నిరూపించే బాలశిక్షాను రచించి ప్రకటించవలెను. అని వీరు తీర్మానాలు చేసినారు; గొప్ప పండితులను రప్పించి చెన్నపట్నంలో సభచేసి, * గ్రామ్యభాష త్యజించవలసినదనీ పూర్వలాక్షణిక మతానుసారమగు భాష ప్రయోగించవలసినదనీ 'అర్థానుస్వార శకటరేఫములు శబ్దస్వరూపావయవము లగుటను, శబ్దవ్యుత్పత్తులు నిరూపించుటకు సాధనములగుటను త్యాజ్యములు కావు' అనీ పండితులచేత తీర్మా

*ఈ సభలో ఉన్న పండితులలో ఒక్కరు మాత్రము ఈ తీర్మానమునిరాకరించినారు. వారు ప్రఖ్యాత పండితులు కీ. శే. శ్రీవేది కాశీనాథశాస్త్రులుగారు. "సంస్కృతమందు వైదికభాషకును లౌకికభాషకును వ్యాకరణసిద్ధమైన భేద మెట్లుగలదో ఆ తెలుగునందే యాంధ్రమందున గ్రాంథిక భాషకును వ్యావహారిక భాషకును భేదము గ్రహింపవచ్చుననియు, లౌకిక భాష కేవలము గ్రామ్యమని విసర్జింపక దానికిం దగునట్లు వ్యాకరణ మేర్పఱచి యట్టి వ్యాకరణము ననుసరించి వ్యావహారిక భాషను గ్రంథములం బ్రయోగించుట కాక్షేపణ యుండఁగూడదనియుఁ దమ యభిప్రాయముగాఁ జెప్పిరి." (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం॥ 1 పు. 23) ఈ పండితుని హితోపదేశము పరిషత్తువారు తృణీకరించినారు.

నాలు చేయించినారు. ఉద్దిష్టకార్యములు నెరవేర్చుటకు సమర్థులయినవారిని ఎంచి ఉపసంఘములు ఏర్పాటు చేసినారు. ఆరంభశూరత్వము ఆంధ్రులకు సహజమంటారు. రేపో మాపో ముందుగా బాలశిక్ష అచ్చుపడుతుంది, బడులలో పాఠ్యపుస్తక మవుతుంది, అని ఆశలుపుట్టేటట్టు ప్రకటనలు చేసినారు. ఇప్పటికి ఇరవై ఆరేండ్లయింది. పరిషత్తు గర్భంలోనుండి అది పైకివెడలి రానేలేదు. వస్తుందని ఆశా లేదు. ఏమయిందో! గ్రాంథికాంధ్రవ్యాకరణము పుట్టే సూచనలు ఏమీ కనబడలేదు. 'నిషేక'మయినట్టే లేదు. మొదటినుండీ నిఘంటుసృష్టియందే పరిషత్తు ప్రయత్నమంతా ఏకతానమైనది.

7. రామయ్యపంతులుగారు, నిఘంటు నిర్మాణము విషయమై తాము సంకల్పించిన విధానము నిరూపిస్తూ 1912 వ సం॥ ఆరంభమందే ఇంగ్లీషుభాషలో ఒక వ్యాసము రచించి, పండితులకే కాక నాబోటివారికికూడా ప్రతులు పంపినారు. డాక్టర్ మరే్రగారు రచించిన ఆక్సుఫర్డు ఇంగ్లీషు నిఘంటువు ఏవిధమున నిర్మించబడ్డదో అదే విధమున తామున్ను "ఆంధ్రభాషాసర్వస్వము" శబ్దముల పుట్టు పూర్వోత్తరములు, వ్యుత్పత్తులు, అర్థాలు, ప్రయోగాలు సవిస్తరముగా వివరిస్తూ ప్రకటించడానికి తాము సంకల్పించినట్టు తెలియజేసినారు. అప్పుడు నామిత్రులు, కీ. శే. విండ్లచెరువు గోపాలయ్యగారున్నూ నేనున్నూ మా అభిప్రాయములు సవిస్తరముగా వ్యాసరూపమున వ్రాసి పంతులువారికి పంపినాము. ఆవ్యాసము ఆంధ్రపత్రికలో ప్రకటితమైనది గాబోలు.

8. పంతులవారు విశ్వామిత్రగోత్రజులైనా సంకల్పమాత్రాన మరే్రగారి ఇంగ్లీషు నిఘంటువువంటి ఆంధ్రనిఘంటువు పుట్టించగలరా, ఈకలికాలములో? మరే్రగారు ఇంగ్లీషు నిఘంటువు రచింపబూనుకోక పూర్వమే ఇంగ్లీషు గ్రంథాలన్నీ పండితపరిషత్తుల పరిశ్రమచేత సుపరిష్కృతమయి సిద్ధముగాఉన్నవి; వాటిలోనుండి ఎత్తుకొన్న శబ్దముల రూపమునకు, అర్థమునకు, ప్రయోగమునకు, ఆగ్రంథములు ప్రమాణములు. శబ్దములవ్యుత్పత్తులు భాషాతత్వవేత్తలు తమ పరిషత్తులో చర్చించి నిరూపించి అనేక సంపుటములలో తమ తీర్మానాలు వ్రాసిపెట్టినారు. జర్మనీలోను, ఫ్రాన్సులోను, అమెరికాలోను ఇంకామరికొన్ని దేశములలోను భాషాతత్త్వవేత్తలు చేసిన కృషియొక్క ఫలముకూడా వీరికి దొరికింది. ఆంగ్లసామ్రాజ్యమందంతటా సమర్థులయినవారు సహకారులయినారు. ఇట్టి సహాయసాధన సామగ్రి సంపత్తి మరే్రగారికి ఉండినందున, ఆయన మరణానంతరముకూడా, ఆయన ఆరంభించిన పని సాగి కడతేరినది.

9. ఏరీ తెలుగు పండితులు మ(క్రే)వంటివారు, వారి సహాయులవంటివారున్నా? ఏవీను పరిష్కృతమయిన తెలుగు గ్రంథాలు? సాధువులని అందరూ అంగీకరించదగిన పాఠములుగల ఆంధ్రభారతమయినా ఆంధ్రసాహిత్యపరిషత్తువారు అమర్చి పెట్టుకోలేక పోయినారే. తక్కిన గ్రంథములమాట చెప్పనక్కరలేదు; అన్నీ అపపాఠములతో నిండి ఉన్నవి. * ఇక ప్రమాణముగా గ్రహించదగిన ఆంధ్రవ్యాకరణము ఏదీ? ఆంధ్రశబ్దముల వ్యుత్పత్తులు, పరిషత్పండితులుగానీ, విశ్వవిద్యాలయాల పండితులుగానీ నిరూపించి ఉంచినారా? అవి ఏగనిలోనుండి తవ్వి తేవలె ననుకొన్నారు పంతులవారు? మూడు వేలయేండ్ల క్రిందట మన దేశములో భాషాతత్త్వ జిజ్ఞాస విజృంభించినదిగాని తర్వాత క్షీణించినది. యూరపుఖండంలో, పండితులు సంస్కృతము పరిశీలించినట్లు, మనదేశమందు పండితులు చేయలేదు. దేశభాషలలో బంగాళీ మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. కలకత్తా విశ్వవిద్యాలయం వారి ప్రోత్సాహము కారణముగా బంగాళీ భాషా చరిత్రము రచితమయినది. మన తెలుగుభాష దిక్కుమాలినది. తెలుగుపండితులకు సంస్కృతము మీదనే ఎక్కువ అభిమానము; నాలుగు తెలుగుపద్యాలు అల్లడమే తెలుగుపాండిత్యానికి ఫలము. చెన్నపట్టణము విశ్వవిద్యాలయంలో తెలుగు భాషా తత్త్వం పరిశీలించడానికి మొన్ననే మొదలుపెట్టినారు. ఆంధ్రవిశ్వవిద్యాలయములో కావ్యపఠనమే ముఖ్యమైనది.

10. ఆంధ్రభాష ఇట్టి స్థితిలో ఉన్నా, భాషాభిమానము అపరిమితము కావడంచేత తమ ఉద్దేశమునకు ప్రతికూలముగా ఎవరు ఏమి చెప్పినా అప్పుడు పెడచెవిని పెట్టినారు పంతులువారు. అయితే ఆయన ఉత్సాహమునకు భంగము కలిగినది, ఆతర్కితముగాను. పరిషత్కార్య నిర్వాహకవర్గంవారు కీ॥ శే॥ కళాప్రపూర్ణ వేదం వెంకటరాయ శాస్త్రులవారిని నిఘంటు నిర్మాతలుగా నియోగించినారు. వారు 1916 వ సం॥ లో, తాము అవలంబింపదలచిన నిఘంటు నిర్మాణపద్ధతి నిరూపిస్తూ, "ఆంధ్రభాషా సర్వస్వార్థ నియమకతిపయములు" అనే పేరుపెట్టి, చిన్న వ్యాసం ప్రకటించి, రెండేండ్లు గాబోలు పనిచేసినారు. వారు ఉద్దేశించినట్లు పని జరిగిఉంటే, రామయ్యపంతులువారు రచించిన నిఘంటువుకంటే, కొన్ని విషయములలో మంచిదనదగిన గ్రంథము శాస్త్రులవారు రచించి ఉందురు. గాని వారి పని సాగకుండా ఆగిపోయినది. పరిషత్తువారికి శాస్త్రులవారి పని తృప్తికరము కానందున, నిఘంటు

* ఇట్టి అపపాఠములు గల పద్యాలు ఈనిఘంటువులో ఇంచుమించుగా అన్నిపుటలలోనూ ఉదాహృతములైనవే; తజ్జ్ఞులు దీనిని ప్రమాణముగా అంగీకరిస్తారా? అంగీకరించవచ్చునా ?

నిర్మాణ కార్యమందు మళ్ళా రామయ్య పంతులవారినే నియోగించినారు. కార్యాలయము పిఠాపురంలో స్థాపించబడ్డది. 1918 వ సంవత్సరములో గాబోలు పంతులవారు ఈ పనికి తిరిగీ పూనుకొని కొందరు పండితుల సాహాయ్యమున నిరంతరముగా పాటుపడి, ఈ మహత్కార్యము సాగిస్తున్నారు. 1936 వ సంవత్సరములో నా విమర్శమునకు విషయమైన ఈ ప్రథమసంపుటము ప్రకటితమైనది. *

11. ఈ గ్రంథమును గురించి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు తమ పత్రికలో ఒక ఘోషణపత్రము ప్రకటించినారు. దానిలోని వాక్యములు కొన్ని ఉదాహరిస్తాను. "శ్రీ పిఠాపురముమహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్ద నిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది. ఇందు అకారము మొదలు ఔకారము వఱకును గల యచ్చు లాది యందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఇదివరకున్న నిఘంటువులన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమ మయినది. ఈ భాగము శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీ రెండు నిఘంటువులకుఁ గల తారతమ్య మూహింపవచ్చును. ఈ నిఘంటువునందు సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువులన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువు నపేక్ష యుండదు. అచ్చికపదములకుఁ గల యర్థభేదములఁ గనఁబఱచి వానికిఁ బ్రమాణవాక్యములును బూర్వగ్రంథములనుండి విపులముగా

* పంతులవారు 1912 వ సం॥ లో మర్రేగారి ఇంగ్లీషు నిఘంటువు మాదిరిని తమ ఆంధ్రనిఘంటువు రచింప నుద్దేశించి చేసిన ప్రయత్నము నెరవేరేది కాదని తెలుసుకొని విడిచిపెట్టి, 1918 వ సం॥ లో శబ్దరత్నాకరము మాదిరిదే, దానికంటె పెద్దది, రచింపవలెనునని ఉద్యమించినారు. ఇది దుష్కరమైనపని కాదు. సంస్కృతనిఘంటువులలో పూర్వులు సంగ్రహించిన మాటలు ఎత్తుకరావడము. మర్రే నిఘంటువుకూ, వీరు ఇప్పుడు రచించిన నిఘంటువుకూ ఎందులోనూ ఏమీ పోలికలేదు. నేడు ఇంగ్లీషు భాషలో నెలకొని ఉన్న మాటలన్నీ వాటిపుట్టుపూర్వోత్తరాలతో, ఒకటీ విడవకుండా ఇంగ్లీషునిఘంటువులో చేర్చబడినవి: సూర్యరాయాంధ్రనిఘంటువులో చేర్చబడిన వన్నీ తెలుగుభాషలో నేడు నెలకొని ఉన్నవి కావు; ఇటువయిని కవులు వాడుకోడానికి ఉచితమయినవని పంతులవారికి తోచిన సంస్కృతశబ్దాలు అనేకము చేరినవి: ఇప్పుడు వాడుకలోఉన్నవి అనేకముగా గ్రామ్యములని కాబోలు విడిచినారు. ఐనా, మర్రేగారు ఇంగ్లీషునిఘంటువు రచించినట్టు వీరు తెలుగునిఘంటువు రచించినారని కొందరు స్తోత్రము చేస్తున్నారు. దానివల్ల వారికి కీర్తికిమారుగా అపకీర్తి కలుగుతుంది. (చూ. Journal of the **Andhra Historical Research Society**, Jayanti Ramayya Pantulu 75th **Birth Day** **Commemoration volume, P. X. X.)**

నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగు శబ్దములకు సంస్కృతద్రావిడాది భాషలయందుఁగల సజాతీయ పదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దము లేకాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁగల యర్థములును బ్రయోగములునుగూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఏవిధముగఁ జూచిన నిది యిదివరకున్న నిఘంటువు లన్నిటికంటె మిన్నయని మఱియొకసారి నిస్సంశయముగఁ జెప్పవచ్చును. దళసరి కాగితములమీఁద నచ్చు వేయఁబడినది. చక్కని యక్కరములు. తోలు, క్యాలికోలతో గట్టి బైండు చేయఁబడినది. గిల్టు అక్షరములతోఁ బెరుగలదు. పుస్తక భాండాగారముల కిది యలంకారముగ నుండును. విద్యార్థులకు సహకారి. ఈ పుస్తకమును రచించుటకు ముద్రించుటకు విశేష ద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁగూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో సాదా ప్రతి వెల రు 5 లు, ఆర్టుపేపరు ప్రతి రు 7 లు, మాత్రమే నిర్ణయింపఁబడినది. కావలసినవారు, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు కార్యదర్శులకు వ్రాయఁగోరెదము."

12. ఈ ఘోషణారచన చూడగానే నా మనస్సు అత్యంతవిస్మయాకులమైనది. ఆంధ్రసాహిత్య పరిషత్తునా కేమిటి, దోషభూయిష్ఠమయిన యిట్టి ఘోషణ ఘోషించడ మేమిటి! పరిశుద్ధ గ్రాంథికాంధ్ర భాషాదేవీపీఠము గదా ఈ పరిషత్తు! సలక్షణ గ్రాంథికాంధ్ర భాషా ప్రవర్తకులనీ, అత్యంత సూక్ష్మనియమ నిష్ఠాగరిష్ఠులనీ, వ్యావహారికాంధ్ర భాషానిర్మూలనాభినివేశావిష్టులనీ లోకములో ప్రఖ్యాతి పొందిన వారే ఈ పీఠాధిపతులు! వీరీ ఘోషణలో ప్రయోగించిన కొన్ని శబ్దములు వీరి నిఘంటువులో కనబడవు; అవి గ్రామ్యములు గాబోలు. ఇక, ఘోషణలోని విషయము భాషకంటె మరింత విస్మయావహముగా వున్నది. మందులు విక్రయించేవారు తమమందులను గురించి ఈలాగుననే ఘోషించడము అందరూ ఎరుగుదురు. అయితే ఏ సరుకైనా కొనేవారు సరుకుయొక్క మంచిచెడ్డలు ముందుగా చూచుకొంటారు, వివేకులయితే. "సర్వరోగ సంహారిణి. ఇది ఒకడబ్బీ కొనండి!" అనే ఘోషణకు "మీబట్టతల ముందుగా పోగొట్టుకోండి" అని ప్రతివచన మివ్వడము వివేకమనిపించుకొంటుంది. "ఇందు, అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాది యందుఁగల సంస్కృతాంధ్ర శబ్దము లన్నియుఁ గలవు" అని వీరు ఘోషించినారే! ఎంతసాహసము! వందల కొలదిగా ఉన్నవే ఈ నిఘంటువులో చేరని శబ్దములు, సంస్కృతములూ, ఆంధ్రములూ కూడాను. ఏవో మారుమూలనున్నవి కావు, ఆంధ్ర

భారతములోనివే కొన్ని కనబడలేదు. సంస్కృత కావ్యములలోనివి కొన్ని లేవు. ఒక్కటి కొరతయినా, వీరిఘోషణలోని 'అన్నియుఁ గలవు' అనే వాక్యము బొంకు కాక మానదే! ఈ విమర్శము ఉత్తర భాగములో ఈవిషయము సవిస్తరముగా విశద పరుస్తాను.

13. "ఇది (అనగా ఈనిఘంటువు) యున్నచో సంస్కృత నిఘంటువు నపేక్షు యుండదు" అన్నారు. ఏమిటీ! ఆప్టే, తర్కవాచస్పతి మొదలయినవారు రచించిన నిఘంటువులు నిష్ప్రయోజనములుగా చేస్తుందేమి ఈనిఘంటువు? అబ్బా! సంస్కృతము నేర్చుకొనే ఆంధ్రుల భాగ్యమే భాగ్యము! సంస్కృత విద్యార్థులు శబ్దముల వ్యుత్పత్తులు తెలుసుకో నక్కర లేదా? ఏవీ? ఈనిఘంటువులో ధాతువులు వ్రాయనే లేదు; అవి ఏవర్గములోనివో, అవి ఆత్మనేపదులో పరస్మైపదులో లేక ఉభయ పదులో, ఏలాగున తెలుస్తుంది? క్త్వార్థక రూపములు తుమున్నంతరూపములు, 'అపి' మొదలయిన అవ్యయములు ఇటువంటివి ఎన్నో విషయములు ఈనిఘంటువులో లేవే. ఆప్టే నిఘంటువువంటివి సంస్కృత విద్యార్థులకు అనావశ్యకములుగా ఏలాగున చేయ గలదు ఈ నిఘంటువు? సమానార్థకములయిన పర్యాయపదము లొక్కచోట ఇందులో దొరకవే; అమర మనావశ్యకమా? ఆప్టేనిఘంటువులోని వైదికశబ్దములు కూడా, 'అగువు' వంటివి గుర్తించేన బడ్డట్లు, వివేకములేకుండా ఎత్తుకొన్నారే! ఆప్టే గారు అవి వైదికములని స్పష్టముగా నిర్దేశించినారు. వీరి బృహన్నిఘంటువులో అట్టి నిర్దేశములేమగదా, విద్యార్థులు ఇవి లౌకిక శబ్దాలనుకొని మోసపోరా? సంస్కృతము లౌకిక భాషగా ఉండినప్పుడు, కేవల వైదికములు లోకములో శిష్ట వ్యవహారంలో లేనందున, వాటిని లౌకికభాషలో కలపకూడదనే నియమము ఏర్పడ్డది. ఇంగ్లీషులోనూ అట్టినియమమున్నది. ఇప్పటివారి వ్యవహారములో లేనిమాటలు, షేక్స్పియరు నాటకములలోనివైనా, బైబిల్‌లోనివైనా, ఇప్పటి ఇంగ్లీషులో కలపడము దోషము. అయితే, గ్రాంథికాంధ్రము కృతకభాషగనుక నన్నయాదులు వాడిన పాతమాటలు ఇప్పటి మాటలతో కలిపి, తెలుగు పండితులు తమగ్రంథాలు రచిస్తున్నారు. 'అగువు'వంటి వైదికశబ్దాలు వీరినిఘంటువులోనుండి ఎత్తుకొని భావి కవులు వాడితే ఎవరిది ఆదోషము! ఆపాపము?

14. "ఈ భాగము (అనగా అజాది శబ్దములుగలది) శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీ రెండు నిఘంటువులకుఁగల తారతమ్యమూహింప వచ్చును" అని సాటోపముగా వ్రాసుకొన్నారు. తమ నిఘంటువులో ఈ భాగము

వెయ్యిపుటలు పట్టినదట! బృహన్నిఘంటువుగాదా? అంటారు పరిషత్తువారు. 'గ్రాంథికాంధ్రము సంస్కృతముకంటె గొప్పది' అని శ్రీ కాశీ కృష్ణాచార్యులుగా రన్నట్టే,పరిషత్తువారున్ను అంటారుగాబోలు. సంస్కృతమూ, ప్రాకృతమూ, దేశ్యమూ మొదలయిన వెన్నో ఉన్నవి దానికి అంగాలుగాను. పరిషత్తు వారి నిఘంటువులో ఉన్న సంస్కృతాలు తెలుగు వారి వ్యవహారములోనివీ, నన్నయాది మహాకవులు తమ గ్రంథాలలో ప్రయోగించినవీ, మాత్రం అయితే, గ్రాంథికాంధ్రములో అవి చేరడానికి కొంత కారణముంటుంది. అలాగునకాక ఇప్పటివరకూ ఏ కవీ ప్రయోగించకపోయినా, ఇటుపయిని ఏ కవి అయినా ప్రయోగించవచ్చును గదా అని చెప్పి, సంస్కృత నిఘంటువులు చూచి, వాటిలోని శబ్దాలన్నీ అర్థాలతోను, వివరణలతోను, ప్రయోగాలుగల శ్లోకాలతోను యథేచ్ఛముగా ఎత్తుకువచ్చి తమ నిఘంటువులో చేర్చుకొని బృహత్తు సంపాదించుకో దలంచినారే! ఇట్లు సంస్కృతాలు అన్నీ చేర్చ డానికి వీరు చెప్పిన కారణము ఎంతో హాస్యాస్పదముగా తోస్తున్నది! చూడండి ఏ మన్నారో—

"సంస్కృతశబ్దము లేవియో కొన్ని తప్పం దక్కినవి యథేచ్ఛముగాం దెనుంగులో వాడవచ్చును. వానిని దత్సమములుగా మార్చుట కాంధ్రవ్యాకరణములలో సూత్రము లేర్పడి యున్నవి. కావునం బూర్వకవులు ప్రయోగించియుండని శబ్దముల భావికవులు ప్రయోగింపవచ్చును. మఱియు నిఘంటువు పాఠకులకు మాత్రమే గాక గ్రంథరచనము చేయువారికిం గూడ నుపయోగించునట్టిదిగా నుండవలయును. గ్రంథరచనము చేయువారు సంశయము గలిగినప్పుడెల్ల నిఘంటువులం జూచు చుండుట యనుభవసిద్ధము." *

15. ఓహో! పంతులవారి అనాగత విధాతృత్వము! ఎంతదూరదృష్టి! భవితవ్యం ముందుగా తెలుసుకొని, అందుకు తగిన సన్నాహం అంతా చేసినారు! అనాయాసంగా కూడాను! ఎంతో సుకరమైన ఉపాయము; ఎవరుపడితే వారు అవలంబించవచ్చును. "ఆలులేదు;చూలులేదు;కొడుకుపేరు సోమలింగం" అన్నట్టుందంటారు యద్భవిష్యులు. "ఆలూ రావచ్చు; చూలూ రావచ్చు; కొడుకూ పుట్టవచ్చు; సోమలింగమని పేరూ పెట్టవచ్చు; అంతేకాదు, వాడికి రోగాలు రావచ్చు; ఆరోగాలకు మందులు కావలసి

* శబ్దరత్నాకరము సాధువుగా గ్రహించి, మోసపోయిన కవులు చాలామంది ఉన్నారు. రామయ్య పంతులువారు ఆ వర్గంలో చేరినవారే. అమరంలోని బాలతనయః అనే శబ్దమును గురించి క్షీరస్వామి వ్రాసిన వ్యాఖ్యానము చూస్తే, నిఘంటుకర్తలు ఎట్టి భ్రమప్రమాదములకు లోనవుతారో తెలుస్తుంది. లౌకికభాషకు లోకమే ప్రమాణము; గ్రంథస్థభాషకు గ్రంథమే ప్రమాణము. వీటికి విరుద్ధమయిన నిఘంటువుగానీ, వ్యాకరణముగానీ ప్రమాణము కాదు.

వచ్చు; ఆ మందులు చేయడానికి ఓషధులు కేవలసివచ్చు; గనుక ముందుగానే ఓషధులపేళ్ళన్నీ దేవభాషలో అశ్వినీదేవతలూ, ధన్వంతరీ మొదలయినవారు వ్రాసి పెట్టినవి ఈ నిఘంటువులో చేర్చిపెట్టినాను. అవిఅన్నీ సోమలింగం రోగాలుపోగొట్టడానికి ఉపచరిస్తవి" అన్నట్లుగా అంటారు పంతులవారు.

16. నన్నయ మొదలుకొని ఇప్పటివరకూ ఆంధ్రకవులు ప్రయోగించని శబ్దాలు వేలూ లక్షలూ ఉన్నవి సంస్కృతములో. అకారాదిగా చాలా శ్రమపడి అనేకులు సంస్కృతశబ్దాలన్నీ నిఘంటువులలో చేర్చిపెట్టినారు; గాని అవి తెలుగువారికి అందుబాటుగా లేవు. అవి అన్నీ తెలుగుకవులు చూరగొనవచ్చు; అవి అన్నీ ఈ నిఘంటువులో, ఒక్కమనిషికి కూలిచ్చి, పోయించి వేసినాను. ఇటు పయిని ఆంధ్ర వాఙ్మయము అశ్రుత స్మృత దృష్టపూర్వంగా విజృంభిస్తుంది. భావికవులు (భావకవులు కాదుసుమండీ; భావకవులకు ఈ నిఘంటువుతో పనిలేదు.) ఎవరుపడితేవారు, ఎప్పుడుపడితే అప్పుడు, ఏ సంస్కృతశబ్దమైనాసరే, చట్టన ఈ నిఘంటువునుండి ఎత్తుకొని వాడవచ్చును. యతికోసమూ ప్రాసకోసమూ కావలసిన మాటలు స్ఫురించనప్పుడు, ఆంధ్రకవులకు శబ్దరత్నాకరముగదా ఇప్పటికి శరణ్యము. శబ్దరత్నాకరములో శబ్దరత్నాలన్నీ లేవు; ఈ నిఘంటువు సర్వశబ్దచింతామణి. దీనిలోనుండి ఎత్తి తీసిన శబ్దాలు ప్రయోగించి రచించిన మహాకావ్యములు విశ్వవిద్యాలయములలో పాఠ్యపుస్తకములుగా నిర్ణయిస్తారు. అవి విద్యార్థులకు బోధపర్చడానికి ఆవిద్యాలయములలోని పండితులకు ఇవి ఉపచరిస్తవి. ఆంధ్రపత్రికలలో గ్రాంథికభాషను సంపాదకీయ వ్యాసములు రచించేవారికి, ఆ వ్యాసములు చదివేవారికీ ఈ నిఘంటువు అత్యావశ్యకము.''—అని పంతులవా రంటా రనుకొంటాను. అపరిమితప్రయోజనంగా ఈ నిఘంటువు ఇట్లు రచించవలెననే ఉపాయము పంతులవారికి ఎప్పుడు ఏలాగున తోచిందో తెలియదు. ఇది ఆకస్మిక ప్రత్యవభాసము.

17. ఇది ఇంతవింతగా నాకెందుకు తోచిందో విశదపర్చవలసి ఉన్నది. పంతులవారు 1912 వ సంవత్సరములో నిఘంటు నిర్మాణకార్యము సంకల్పించినప్పుడు, 'Note on the Compilation of a Comprehensive Etymological Dition-ary of the Telugu Language'. అనే పేరు గల చిన్నపుస్తకమొకటి ఇంగ్లీషున రచించి ప్రకటించినారు. సంస్కృతశబ్దములు ఈనిఘంటువులో చేర్చడమును గురించి అప్పుడు వారికి గల అభిప్రాయము ఎట్లుండెనో చిత్తగించండి.

"Any Sanskrit word may be used as *tatsama* & there is logically no impropriety in incorporating in our dictionary all the words found

in Sanskrit in our dictionaries. But this would swell the book & its cost without, it seems to me, corresponding advantage. It would, I think, be sufficient to show in the dictionary only those *tatsama* words which have so far found currency in Telugu speech or literature. If more words come into use in future, the reader can refer to a Sanskrit dictionary for their meaning." (Page 3) దీని భావ మేమిటంటే—"ఏసంస్కృతశబ్దమైనా తెలుగులో వాడవచ్చును; సంస్కృత నిఘంటువులలోని శబ్దాలన్నీ తెలుగునిఘంటువులో చేర్చుకోవచ్చును; అందుకు శాస్త్రంలో ఆటంకమేమీ లేదు. గాని ఆలాగున చేయడమువల్ల బూరకాలు (బోదకాలు) లాగున గ్రంథము పెరగడము, వృథాగా వ్రయప్రయాసాలు ఎక్కువకావడము, అందులకు తగిన ప్రయోజనము లేకపోవడము సంభవిస్తుంది; గనుక లౌకిక భాషలో గానీ, గ్రంథాలలోగానీ, ఇప్పటివరకు నెలకొని ఉన్న శబ్దాలుమాత్రం ఈనిఘంటువులో చేర్చితే చాలు ననుకొంటాను. ఇటు పయిని మరి కొన్ని శబ్దాలు వాడుకలోనికి వస్తే, పాఠకులు వాటి అర్థం సంస్కృత నిఘంటువులు చూచి తెలుసుకోవచ్చును."

18. ఈ పద్ధతి సమంజసముగా ఉన్నది. నిఘంటు నిర్మాతలందరూ ఈ పద్ధతినే అవలంబించినారు. మరేగారి ఆక్స్‌ఫర్డు ఇంగ్లీషు నిఘంటువులో, ఇంగ్లీషువారి సంభాషణలోను గ్రంథాలలోను నెలకొన్న మాటలన్నీ (అన్య దేశ్యాలు కూడాను) చేరినవి. అది ప్రకటితమైన పిమ్మట వాడుకలోనికి వచ్చిన మాటలు అనుబంధములో చేరినవి. అట్లే ఆంధ్ర నిఘంటువు రచించవలసినది. అయితే సూర్యరాయాంధ్ర నిఘంటువు ఈ పద్ధతికి విరుద్ధముగా ఎందుకు రచితమయినదో నాకు తెలియదు. పరిషత్తు కార్య నిర్వాహక వర్గంవారో, నిఘంటు నిర్మాణ కార్య వర్గమువారో పంతులవారి అభిప్రాయమునకు విరుద్ధముగా ఈ విధానమును నిర్ణయించినారు గాబోలు; స్వాభిమానము గలవారు ఇట్టి మహాత్కార్యములు తమ అభిప్రాయమునకు విరుద్ధముగా చేయడమునకు పూనుకోరు; పూనుకోకూడదని నా ఆశయము. ఒకవేళ పంతులవారు తను మొదటి మతము మార్చుకొన్నారేమో. ఆలాగున జరిగినప్పుడు, అందుకుతగిన కారణములు ప్రకటించవలెను. తమ ఇంగ్లీషు వ్యాసములో నిషేధించిన పద్ధతి సాధు పద్ధతి అని ఈ నిఘంటు పీఠికలో ఉపన్యసించి, దానిని అనుసరించడము వల్ల, నిఘంటు రచయిత లనేపేరు పొందడము కోసము మతం మార్చుకొన్నారని లోకులు అనుకోడానికి అవకాశం కలుగజేసిన వారయినారు కారా పంతులవారు?

19. తమ నిఘంటువును మరేగారి ఇంగ్లీషు నిఘంటువు మాదిరిని రచించి 'బృహన్నిఘంటువు'గా చేయడము అసాధ్యమైనా, శబ్దరత్నాకరముకన్న ఎన్నో మడుగులు

పెద్దదిగదా? అంటారు. శబ్దరత్నాకరమందు 186 పుటలలో మాత్రము ఇమిడిన గ్రంథము మేము 1000 పుటలుగా పెంచినాము. * ఈ పెంపువల్ల ఆంధ్రవాణిశరీరము ఎంత బలిసిందో చూడండి! అని తాము చేసిన పని చూచుకొని పంతులవారు పొంగిపోతున్నారు. ఇందుకు దృష్టాంతముగా చిన్న ముచ్చట ఒకటి చెప్పడము అప్రస్తుతము కాదనుకొంటాను. నా మనమలలో ఒకడు నా ఉత్తరీయము ఒంటికి చుట్టబెట్టుకొని "నేను ఎంత లావుగాఉన్నానో చూడండీ" అంటే, మరిఒకడు బూర్నీసు చుట్టబెట్టుకొని "నేను మరీలావుగా ఉన్నా"నన్నాడు. మరిఒకడు దిండు కడుపుకు కట్టుకొని, "నేను మరీ మరీ లావుగా ఉన్నా"నన్నాడు. నాలుగోవాడు మంచముమీద పడుకొని పరుపే చుట్టబెట్టుకొని అందరికంటే తానే లావుగా ఉన్నా నన్నాడు. ఆలాగున ఉన్నది పంతులవారు ఆంధ్రవాణికి కలుగజేసిన బలుపు. ఆంధ్రమునకు సంస్కృతమంతా చుట్టబెట్టినప్పుడు, వాచస్పత్యముకంటె లావుగా ఉండవద్దా? అజాది శబ్దములుగల భాగము దానిలో 1594 పుటలుగలిగి ఉన్నదే. ఇంతేకాక, ఆంధ్ర భాషాభివృద్ధికి మరి కొన్ని సాధనము లున్నవి. సంస్కృతము వలెనే ప్రాకృతము ఆంధ్రానికి అంగమని పంతులవారే పీఠికలో వ్రాసినారు. "ఆంగ్లేయభాషలోనికి లాటిన్ (Latin) భాషాపదము ఫ్రెంచి (French) భాషా ద్వారమున వచ్చిచేరినట్లు, తద్భవశబ్దములలో ననేకములు సంస్కృతము నుండి ప్రాకృతభాషా ద్వారమునవచ్చి తెలుఁగులోఁజేరినవి. ప్రాకృతము మాతృభాషగాఁ గల యాంధ్రసంశ్యాది రాజులు కొందఱు ప్రాచీనకాలమందుఁ దెలుఁగు దేశము నాక్రమించి పాలించినట్లు శిలాశాసనములవలనఁ దెలియుచున్నది. ఆకాలమందే తద్భవశబ్దము లనేకములు పుట్టియుండును. ఇటీవల నాంధ్రకవులు కొన్ని తద్భవ శబ్దములు కల్పించియుందురు." గనుక, గ్రంథస్థములయిన "అట్టము" వంటి ప్రాకృత సమములూ, ప్రాకృతభవములూ, ఈ నిఘంటువులో పాళీశబ్దమని నిరూపితమయిన "ఆతుమ" వంటి పాళీమాటలూకూడా (అది బుద్ధునిభాష), భావికవులు, భూతకవుల వలెనే ప్రయోగించడమునకు అనుకూలముగా, ప్రాకృతసర్వస్వములో పేర్కొన్న భాషలలోనివీ, పాళీనిఘంటువులోనివీ, అన్నిమాటలూ చేర్చితే, ఆంధ్రవాణి మరింత లావుగా పెరుగుతుంది. సంస్కృతములో ఉన్న ఒక్క చతుర్ముఖశబ్దానికి వేలకొలదిగా ప్రాకృతరూపాలు ప్రాకృతరూపావతారమనే గ్రంథములో సింహరాజు వ్రాసినాడు. ఈ మాటలకు తోడుగా ఈ నిఘంటువులో చేర్చిన హిందూస్థానీ మాటలవంటివే

*ఈ 1000 పుటలలో ఉన్న మాటలు 13854 గాబోలు. వీటిలో నూటికి 70 కంటే ఎక్కువగా సంస్కృతాలే ఉన్నవి.

వేలకొలదిగా దానిలో చేరనివి మహాకవుల కావ్యములలో ఉన్నవిగదా. హిందూ స్థానీ రాజ్యభాష అవుతుందట; బడులలో నేర్పుతున్నారు. ఆంధ్రరాజులవలెనే అనేక శతాబ్దులు మహమ్మదీయరాజులు మనకు పాలకులుగా ఉండినవారు; గనుక హిందూస్థానీ నిఘంటువులోని మాటలన్నీ భావికవులకోసము ఈ నిఘంటువులో చేర్చవలెను. మరి ఇంగ్లీషు భాషాపదములు (శబ్దరత్నాకరములో నందలుగా ఉన్నవే) దీనిలో చేరలేదు. ఇది గొప్ప లోపము. ఇంగ్లీషుమాటలు వేలకొలదిగా ఆంధ్రవాణి ఒంటికిపట్టి ఉన్నవి. రామయ్య పంతులువంటి వారి వాఙ్మయ శరీరములో సగపాలు ఇంగ్లీషు ఉంటుంది. ఆబాలగోపాలమయి, ఆంధ్రంలో, పాలూ నీరూ కలిసిపోయి నట్లు ఇంగ్లీషుమాటలు చేరిఉన్నవి. అపరిహార్యములు, 11 వ పేరాలో ఉదాహృత మయిన చిన్న 'ఘోషణపత్రము'లో, పరిషత్తువారు పది ఇంగ్లీషుమాటలు వాడక తప్పినదికాదు. నిఘంటుపీఠికలో పంతులవారు 'కామా' 'సెమికోలను' మొదలయిన ఇంగ్లీషుమాటలు ప్రయోగించక తప్పినదికాదు. గనుక ఇంగ్లీషు నిఘంటువులోని ఇంగ్లీషు మాటలన్నీ సూర్యరాయాంధ్ర నిఘంటువులో చేర్చితే, భావికవులకు మహోపకారము చేసినవా రవుతారు పంతులవారు. ఆంధ్రపండితులకు ఇంగ్లీషుభాష నేర్చుకోవడము కష్టమైనా, ఇంగ్లీషుమాటలు తెలుగులో కలిపి వాడడము సులువు గానే ఉంటుంది. ఈలాగున చేస్తే, మర్రేగారి నిఘంటువుకన్న గొప్ప నిఘంటువు కాదా మన నిఘంటువు ? పంతులవారి సంకల్పము సఫలమయినట్టు అవుతుంది కూడాను. ఇంకా మరియొక నిధానమున్నది చూరగొనడానికి. ఇరుగు పొరుగు లనే! దూరముగా లేదు. కవిత్రయము వారు 'కెలసము' వాడి ఉన్నందున కన్నడ భాషఅంతా ఆంధ్రానికి అంగమే అనవలెను. భావికవులు యథేచ్ఛముగా వాడుకొనే టందుకు కన్నడశబ్దాలు చేర్చవలెను. నన్నెచోడుడు 'నాయి' వాడినట్లే, వెంకట నాథుడు మొదలయినవారు అరవమాటలు తమ కావ్యములలో వాడిఉన్నారు. చిన్న యసూరిగారికి అవి యిష్టమయినవే; తాము రచింపదలచిన నిఘంటువులో అవి వారు చేర్చినారు (చూ. అన్నవత్తి) ఈ భాషలూ, ఆంధ్రమున్నూ ఒక్క తల్లి బిడ్డలు కూడాను. అందువల్ల అరవమాటలు కూడా పంతులవారు తమ నిఘంటువులో తప్పకుండా చేర్చుకోవలెను భావికవులకోసము. మరాటిభాష మనకు అప రిత్యాజ్యము. ఎందుచేతనంటే, "క్షితి మహారాష్ట్రభాషచే జెప్పంబడెడు భీక రోక్తులు బిరుదులై పెక్కుదనరు, దాన బిరుదావళి యొనర్పవలయు నండ్రు బుధులు" అన్నాడు అప్పకవి. భావికవులకు ఇట్టిభీకరోక్తులు తెలియకపోతే ఆంధ్రుల శౌర్యం, పరాక్రమం, ప్రతాపం వర్ణించలేరు; గనుక మరాటీమాటలన్నీ చేర్చవలెను.

ఇంకా, బంగాళీ నిఘంటువులోని శబ్దాలుకూడా ఎత్తుకొని తెలుగు నిఘంటువులో చేర్చుకోవలెను. తెలుగు గ్రంథాలలో బంగాళీమాటలు ఇప్పుడు కొన్ని చేరుతున్నవి కావా? ఏమో! శాంతినికేతనమందు విద్యాభ్యాసముచేసిన ఆంధ్రకవులు ఎవరయినా బంగాళీభాష బాగా నేర్చుకొని, సంస్కృతభాషాపండితులు చేసినట్లు, ఆంధ్రభాషను అభివృద్ధి బొందింతురేమో! ఇట్లే ఆంధ్రములో అన్నిభాషలూ కలిపితే మరి చెప్పే దేమిటి దానిభాగ్యము !!!

20. ఇట్టి గ్రంథమును విమర్శిస్తూ ఈలాగున బుద్ధిపూర్వకముగా పరిహసించడము ఉచితము కాదని ఆక్షేపించేవారెవరైనా ఉంటే, గ్రంథనిర్మాతల సంకల్పమే హాస్యాస్పదముగా విమర్శకునికి తోచినప్పుడు, ఆదోషము ప్రత్యక్షీకరించడానికి అట్టిపని చేయడము శిష్టసంప్రదాయమునకు విరుద్ధము కాదని మనవిచేస్తున్నాను. ఇటుపయిని పుట్టబోయే కవులు రచించబోయే కావ్యాలలో వాడబోయే సంస్కృత శబ్దాలు తడవుకోకుండా తెలుసుకోగలందులకు సంస్కృతభాషలోని శబ్దాలన్ని అకారాదిగా పట్టీలువ్రాసి అమర్చిపెట్టడము ఆవశ్యకమనుకోవడమే హాస్యాస్పదమంటాను. నిఘంటువులోని శబ్దాలు వెతకుతూ పద్యాలు రచించడము "అనుభవసిద్ధ"మన్నారు రామయ్యపంతులు గారు. పెద్దన్నగారు కవికి నిఘంటువు ఆవశ్యకమని చెప్పలేదు. ఏదేశములోనూ, ఏకాలములోనూ, నిఘంటువులుచూస్తూ కవికోకిలలు పాడినట్టు ఎవరూ చెప్పగా వినలేదు. వివక్షితార్థము తెలియజేసేమాట, సందర్భోచితమయినది చట్టన స్ఫురించనప్పుడు, ఈ నిఘంటువుచూస్తే తెలుస్తుందనలేము. అందుకు ఆంధ్ర సంస్కృత నిఘంటువు కావలెను. అది లేనప్పుడు అమరమువంటివే ఆపనికి ఉపచరిస్తవి. వాటిలో పర్యాయపదము లుంటవి. నిరుక్తములోని పద్ధతినే సంస్కృత నిఘంటుకారులు అవలంబించినారు. ఏలాగంటే దానిలో పృథివీవాచకశబ్దమునకు పర్యాయపదాలు ఇరవైఒక్కటి ఉన్నవి. సూర్యరాయ నిఘంటువులో పర్యాయపదాలు లేనందున ఈ విషయములో ఆంధ్రవాచస్పత్యము కవులకు ఎక్కువగా ఉపచరిస్తుంది. ఉ. ఆప్టే నిఘంటువులో "అర్బిస : The heart ; flesh in the heart" "అగ్రమాంసం, Flesh in the heart, the heart itself" అని ఉంటే, సూర్యరాయాంధ్ర నిఘంటువులో "అర్బిసము హృదయమందలి మాంసము అగ్రమాంసము" "అగ్రమాంసము, హృదయమునందు పద్మాకారముగా నున్న మాంసవిశేషము" అని అనువదించినారు. "హృదయ"మనే అర్థము విడిచిపెట్టినారు; పోనీండి 'అర్బిస' శబ్దము స్ఫురించనప్పుడు కవిగారు ఏలాగున ఈ నిఘంటువులో వెతకిదానిని తెలుసుకోగలరో ?

21. ఇంగ్లీషు నిఘంటువులు రచించేవారు, ఈకాలములో అవలంబించిన పద్ధతి కళ్లారా చూస్తూ, రామయ్యపంతులుగారు హాస్యాస్పదమైన తప్పులో పడడము నాకు దుఃఖకరముగా ఉన్నది. వారికి భాషయొక్క భూతభవిష్యదవస్థలే ప్రమేయములయినట్లు కనబడుతున్నది. వర్తమానావస్థ ఉపేక్షించినారు. అధునాతనకవుల గ్రంథాలు పేర్కొ లేదు. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు మొదలయినవారు తమ తమ భాషలలో నేడు వాడుకలో ఎన్నిశబ్దములున్నవో అన్ని నిఘంటువులలో చేర్చినారు. ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువు పదిసంపుటములు మూడు నాలుగువందల రూపాయలు పెట్టకొనలేని వారికోసము నలభయి రూపాయలు వెలపెట్టి రెండు సంపుటములలోను, పేద వారి కోసము రు 4-0-0 లు వెలపెట్టి ఒకసంపుటములోను, రు 2-0-0 లు వెలకు చిన్న సంపుటములోను, రు1-0-0 కు బుచ్చిసంపుటములోను, సంగ్రహించి రచించినారు. ఈవిధముగా అనేక కూర్పులు ముద్రితములయి ప్రకటితమవుతూఉన్నవి. బుచ్చి నిఘంటువులోకూడా నిత్యవ్యవహారములో ఇంటా బయటా, అందరూ వాడుకొనే ఇంగ్లీషు మాటలూ, గ్రామ్యాలూ, అమెరికావారిమాటలూ, శాస్త్రాలలో వాడేమాటలూ, ఇవేమిటి అవేమిటి, అన్నీ చేర్చినారు. * ఇంగ్లీషువారి "ఇప్పటి భాషాసంపత్తి" ఈ నిఘంటువులు తెలియజేస్తున్నవి. ఒకనికి ఉండే ధనసంపత్తి వివరించి చెప్పవలెనంటే, వానికి ఇప్పుడున్న ఇళ్లూ, భూములూ, ఆభరణములూ, నగదూ, కంపెనీల వాటాలు మొదలయినవన్నీ పట్టీలువ్రాస్తారు. వాడుగాని, వాని కొడుకులుగాని, మనుమలుగాని ఇటుపయిని సంపాదించేదిచేర్చరు. దేశము సర్వేచేసేవారు ఇప్పుడున్న స్థితినిబట్టి భూముల పరిమితి మొదలయిన విషయములు తెలియజేస్తారు. ఇటుపయిని కలిగే మార్పులు ఊహించనయినా ఊహించరు. నిఘంటురచన ఇట్టిదే. నేడు మన తెలుగుదేశమందు తెలుగువారి వాడుకలో ఉన్న భాషలోని శబ్దాలన్నీ తెలియజేసే గ్రంథమే వాస్తవమయిన తెలుగు నిఘంటువు అనిపించుకొంటుంది. భాషాపాండిత్యము గలవారు మాటల పుట్టుపూర్వోత్తరాలు వ్రాస్తారు. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువులో ఇంగ్లీషుభాషా చరిత్రము కనబడుతుంది. సూర్యరాయాంధ్ర నిఘంటువులోనిశబ్దాలు మూడు వంతులు వాస్తవముగా నేటి ఆంధ్రభాషలోనివికావు. తెలుగుమాటలపుట్టు పూర్వోత్తరాలా ?—ఆమాట తలచుకొంటే తలవంచుకోవలెను.

—[సశేషము]—

* The Little Oxford Dictionary of Current English :— "This little book is, in truth, something of a wonder. Its range is, first of all, astonishing ; it includes so large a proportion of modern colloquialisms, Americanisms, new scientific and technical terms, foreign words and phrases, sporting terms and slang." *Notes and Queries.*

# గాలివాన

హోరని వర్షం, భోరని గాలి
వర్షధారలో, గాలిమళుపులో
చిమ్మ చీకటిలో చితుకుల గుడిసెలో
జీవాధారం చినుకుల బేరం

* * *

హోరని జీవం, భోరని ప్రాణం
జీవిత మంతా కుండపోతగా
జీవ కాంక్షయే జారిపోయినది.
జీవ ఘోషయే మబ్బుల ఘోషగ
ప్రపంచమంతట హోరని మ్రోగుచు
చిల్లులు పడ్డది ఆశామేఘం;
కళుకు్కమన్నది మానవ ప్రేమ.

దారులు తెలియని కీకారణ్యం
అరణ్యమధ్యం అగాధకూపం
దరిద్రమూర్తులు దారుణవర్తులు
లయవిలయంబుల లాస్యం బాడిరి
సృష్టి వంకరలో మెరుగులు దిద్దిరి.

* * *

దీపపు శిఖపై చివర కాంతితో
కొండ ఎక్కుతూ వన్నెతరిగినది
ఎండిన మానవ హృదయ మర్మము;

పొర్లుపొర్లుగా బూడిద రీతిగ
పొంగిపోయినది జీవాధారం;
చితుకుల గుడిసెలో చినుకుల బేరం
ప్రాణాధారం చల్లని వర్షం.

* * *

ఆ చెట్టు ఈ చెట్టు అల్లాడిపోవగా
గుళ్లోని దీపమ్ము కునుకు మన్నాది;
గుడిసెలో మానవుడు గొల్లుమన్నాడు;

బ్రహ్మాండ గోళాన్ని రాపిల్లు పెట్టేటి
గాలి విసరున భూమి కలవరించినది,
జీవ బాంధవ్యంబు చితికిపోయినది;
ఆ వీధిలో తండ్రి, ఆ దిబ్బపై తల్లి,
ఆ ఇంటిలో పిల్ల, ఈభావిలో పిల్ల,
పచ్చికట్టెల కుప్ప భగ్గుమని మండగా
తడిసిపోయిన ఆశ మండిపోయినది.

# దిబ్బ

ఊరి బైటా దిబ్బ.
దిబ్బపై తలమెత్తు దుబ్బు లేచినది
దిబ్బచుట్టూ గొప్ప కాల్వ పారినది
కాల్వలో మొలలోతు నాచు పెరిగినది
కాల్వగట్టున బండ పాచిపట్టినది
నాచులో దిగబడ్డ పాముచందాన
పాచిపట్టిన కొండరాయి అందాన
కోర్కె పెరిగిన మనుషి కోటలో లేదు
ఆదిబ్బపై నేను
నేను త్రవ్విన కాల్వ
నేను పెంచిన దుబ్బు
నాఇల్లు నా ఆస్తి విడిచిపో లేను.

# వెర్రి

కొండెక్కుతున్నది గొర్రెలమంద
మందకాపరి ముందు దారి తీశాడు
అటుపక్కనోలోయ ఇటుపక్కనో చెరువు
ముందువెనుకల దారి మూసుకు పోయె.

ఎండ కస టెక్కినది;
ఎసరు కాగిన కీతి ఉడికిపోయినది.
నాగరిక మార్గాన అగచాట్లతో పాటు
నవ్యమానవు డంత నవసిపోయాడు.

మందలో గొర్రెగా మారుపడ్డాను;
నాల్గుమూలాల వెర్రి పరుగు లెత్తాను;
దిక్కులే నావెంట తరుము కొచ్చినవి;
పక్షులూ నావంక పరుగు లెత్తినవి;

మందకాపరి ముందు మాయమైనాడు;
మందలో ఒకగొర్రె పరుగు పెట్టినది;
భయపడ్డ గొర్రె కే పాటు గలిగినదో
ఆ పాటులో నేను వెర్రినైనాను.

**దే వ రా జు  కృ ష్ణ శ ర్మ**

# మార్పు

**వా వి లా ల  సో మ యా జు లు**

మావూరి దేవుళ్ళు మాటాడలేరో !
కూర్చొనివున్నట్లె కుమిలిపోయారో !!
మమత మారింది
మదము మారింది
మనసుల్లు మారినవి
మతులు మారినవి.

మావూరిమాంత్రికులు మరచిపోయారో!
తరతరంబులవిద్య తరచుచున్నారో !!
మాటలే మారినవి
పాటలే మారినవి
ఆటల్లు మారినవి
బాటల్లు మారినవి.

మావూరినాయకులు మరగుపడినారో !
స్వాతంత్ర్యయుద్ధంబు సాగించుకొనలేరో !!
దేశంబు మారింది
వేషంబు మారింది
రోషంబు మారింది
రోజుల్లు మారినవి.

మావూరికవులెల్ల మాసిపోయారో !
జాతీయగీతముల జాలు కన్పింపదే !!

# అన్యోన్యాశ్రయము

**కా. సూ.**

మైదానంమీదికి వెళ్లీవెళ్ళగానే, "ఇదిగో, ఈమూలగా పక్కనిపక్కని నిలుచొని క్రికెటు ఆడుతూఉన్న పిల్లకాయలు మీ కొడుకు లేనా" అని అంటూ ఎవరోఒకతడు నవ్వుముఖంతో నాకు ఎదురుగావచ్చి నిల్చున్నాడు. "ఔను, మావాళ్ళే" అని సూచన చేసేటట్టు తల ఆడించినానుగాని నోటితో జవాబుమాత్రం చెప్పలేదు. జవాబు చెప్పడానికి ఏమో మనస్కరించలేదు అతని వేషంచూస్తేను. "అలాగే అనుకున్నాను. ఇంచుమించుగా ప్రతిరోజూ వాళ్ళని కదిపించి చూస్తున్నాను. సీమ మిరపకాయల వంటివాళ్ళు. వాళ్ళనిచూస్తే నాకు చాలా సంతోషం" అన్నాడు అతడు ఊరుకోక. వేషాన్నిబట్టిచూస్తే బికారి. భాషనుబట్టి చూస్తే ఏ మర్యాదస్థుడూ ఏవిద్వాంసుడూ కూడా అతనికి అందేటట్టు కనబడడంలేదు. ఏ భాషలోను ఇంకొకపేరు సరిపడినది లేదు కాబట్టి అతడు కట్టుకున్నదానిని పంచ అని అనాలి: చింకిపేలికలు వేలాడుతున్నవి. మురికి ఓడుతూంది. షర్టు అంటూ ఉంటే పాపం, వేసుకొనునుకాబోలు. ఒకప్పుడు కోటు అనిపించుకోడానికి అధికారంగల ఒక చింకి జల్లెడ గుడ్డను తొడుగుకొన్నాడు. పూర్వము ఏమో తెలియదు గాని ఇప్పుడు ధూళిరంగు దానిది. జిడ్డు ఓడ్చవచ్చును. మెడకు టై కట్టుకున్నాడు. దీనికి రెండు పక్కల నుంచీన్నీ తెల్లగా పండిన దిశబోర కనిపిస్తున్నది. అతని ముఖాన్ని పలకరించి ఒకనూసమైనా అయిఉంటుంది కత్తికి. నోటిలో చుట్ట; దానిని కొరికి కొరికిపోస్తున్నాడు. చంకను చిరికి చాపచుట్ట. దీని కొనలనుండి మురికి బట్టల కొంగులు తొంగి చూస్తున్నవి. మనిషి పిక్కలా గున్నాడు. చూడగానే 'అరవవాడు, క్రైస్తవ మతస్థుడు' అని ముఖంమీద వ్రాసినంత స్పష్టంగా తెలుస్తున్నది. కాని నిర్దుష్టమైన ఇంగ్లీషు మాట్లాడుతున్నాడు. ఉచ్చారణ చూస్తే వందలో ఒకడికైనాఅట్టిదిపట్టుబడడం కష్టం. ఇంగ్లీషుభాషలో మూలమూలల వాడుక మర్యాదలు కూడా ఇతనికి పట్టుబడడం చూస్తే మంచి సమర్థతగల ఆంగ్లేయులవద్ద ఇతడు ఈభాష నేర్చుకున్నట్టు కనిపిస్తుంది. "అసామాన్య ప్రజ్ఞగల గురువులవద్ద చదువుకున్నారటగదూ మీరు? ఆయన పాండిత్యాన్నిగురించికొంతకాలంకిందట నేనున్నూ విన్నాను. నా గురువులలో ఒకరిద్దరు అంత అసామాన్యప్రజ్ఞకలవారుకూడానునుమండీ" అని గర్వంగా అంటూ ఒకర్ణ రవంత కాలం ఆలోచనలో పడ్డాడు. "మనకు

పరిజ్ఞానవంతులు గురువులు దొరకడం దుర్ల
భం కాదు. పరిజ్ఞానవంతులు శిష్యులు దొర
కడం అంత కష్టం కాదు. కాని కడుపున
పుట్టిన బిడ్డలు పరిజ్ఞానవంతులు కావడం
అతి దుర్లభం, దుర్లభం! అంటూ మాట్లా
డడం చాలించినాడు. ఇదివరకు ముఖం
మీద ఉన్న నవ్వు చటుక్కున మాయం అయి
పోయింది. మనిషి పుల్తూ పుల్తూ మంటూ
నిలువబడ్డాడు. నా నేపు తిప్పిఉన్నా, అపార
మైన దూరాన్ని చీల్చుకొని ఎక్కడో
చూస్తున్నట్లు అతని కన్ను నిలకడగా
నిలిచిపోయినది. ఇప్పుడు ఇతడు అన్న
మాటలను బట్టి చూస్తే ఇదివరకు నేను
ఇతనిని గురించి ఊహించినది రూఢమైనది-
ఇతని గురువులలో కొందరు పరిజ్ఞానవంతులని.
'పరిజ్ఞానవంతులు శిష్యులు - మనకు - అంటు
న్నాడే ఇతడు' నేను ఉపాధ్యాయుడ నని
ఇతనికి ఏలాగో ఇంతకుముందు తెలిసి ఉండ
వచ్చును. ఇతడున్నూ ఉపాధ్యాయుడేనా?
అయితే ఎందుకీ దీర్ఘాలోచన? పిల్లలు
లేరా? ఉంటే వాళ్ళు తండ్రికి అనుకూలంగా
ఉండడం లేదా? అనుకూలంగా ఉంటే పరిజ్ఞా
వంతులు కారని అతనికి చింతా? లేక ఈ
ఆలోచనకు కారణం ఈ సంభాషణతో సం
బంధమే లేదా? ఏమీ నాకు బోధపడలేదు.
నేనున్నూ అతనిని చూస్తూ నిలువబడ్డాను,
కొంతవరకున్నూ, వింతేమో చూదామని.
కంటిలో పూర్వం ఉన్న కలకలపోయి
చూపు ఘనీభవించింది. అతడు నా ప్రపం
చంలో లేడు. ఇద్దరమున్నూ ఒకరికి ఎదు
రుగా ఒకరము మొహంమొహం చూచు
కొంటూ నిలువబడడం, ఒకరితో ఒకరము
మాట్లాడకుండా ఉండడం వల్ల కలిగిన
నిశ్శబ్దం క్షణక్షణానికి బరువెక్కడం ఇతనికి
ముఖంలో ఉన్న కళ అంతకంతకూ మారు
తూ రావడం చూచి నాకు భరించ శక్యం
కాక అతనిని అప్పటికి ఆవరించియున్న
ఊహాప్రపంచపు బాధనుంచి తప్పించవలె
నని తలుచుకొన్నాను. వెంటనే నాకు అను
భవంలోవున్న ఒక ఉపాయం తట్టినది.
మనస్సుకి ఇష్టమైన ఊహాలవల్ల పుట్టే సుఖ
మును అంతులేకుండా అనుభవించ వలెనని
దానికి ఎంత ఆతురతగా ఉంటుందో, ఇష్టం
లేని ఊహాలవల్ల కలిగే బాధనుంచి తొల
గించుకోవడానికి కూడా అంత ఆతురత
గానూ ఉంటుంది. దృఢమైనదైతే తన
బలంవల్లనే ఈ అనిష్టమైన ఊహా ప్రవా
హానికి అడ్డు కట్టుకట్టి దానిని ఇంకింప
జేస్తుంది. ఒకవేళ ప్రవాహపు వడికి
లొంగవలసివచ్చినప్పుడు ఇందువల్ల కలిగే
బాధనుండి తప్పించుకోవడానికి తనతో సహా
అదే దేహంలో అమర్చిన చెవులయు నాద
తంతువులయు సహాయము తీసుకొని నాద
తంతువులనుపురికొల్పి వాటిచేత పలికిస్తుంది.
వెంటనే చెవులు ఈ నాదాన్ని వింటవి.
ఇందువల్ల మనస్సులో మరొకభాగానికి కద
లిక పుట్టుతుంది. రెండు రంగములయందు
న్నూ ఒక్కేచురుకుగా కథ నడిపించడానికి

తగినంతబలం చాలదుగనుక మొదటిరంగం ముగిసి రెండోరంగం మొదలుపెట్టుతుంది. అంటే అనిష్టమైన ఊహాప్రపంచం విడిచి బయట పడుతుందన్నమాట, ఆ మనస్సు. ఇందుచేతనే శివరాత్రివేళ ఒంటరిగా చీకట్లో నిర్జన ప్రదేశంలోనుంచి నడచిపోతూఉన్న వారు పాడుతూపోతారు. ఒంటరిగాఉన్నామే, చీకటే, ఏమౌనో, ఏమిటోఅన్న మహాభయం ఇందువల్ల తొలగిపోతుంది. సగం నిద్రలో చెడ్డకలలు కంటూ ఉన్నవారు 'వో' 'వో' అని పైకి అరుస్తారు. వారికి ఇందుచేత తెలివివస్తుంది; కల్ల ప్రపంచం మాయమైపోతుంది; దానితో అందువల్ల కలిగిన భయంకూడాను. పిచ్చెత్తినవాళ్ళు కూడా ఈకారణంచేతనే పైకి వినిపించేటట్టు వాళ్లల్లోవాళ్లే మాట్లాడుకుంటారు. అయితే వాళ్ళ ఊహాప్రపంచబలానికి సజీవ నాదబలంచాలదు. గనకనే వాళ్ళని చావబాదే వాళ్ళు ఇంతకుమునుపు. ఈసాధనమును ఉపయోగించి బాధ నివారణ చేసుకోవడానికి తగిన శక్తిమనస్సుకి స్వాభావికంగాఉన్నది. ఈ రహస్యం నేను ఎరుగుదును. అందుచేత అతనితో అన్నాను. 'ఆటచూచిన్నీ, ఆడుతూన్న బాలుల సంతోషమును చూచిన్నీ ఆనందించడాకి నేను వచ్చినట్లే మీరున్నూ వచ్చినారా; ఏమిటీ?' అని. సందిని వ్రాయాలని నా ఉద్దేశం, కాని వ్రాసింది కోతి అయింది. అతని మనస్సులో ఏమి గందరగోళం జరుగుతూ ఉందో, ఏమంటే ఏలాగు పరిణమిస్తుందో అన్న అనుమానం చేత నేను అధిక ప్రసంగము ఏమీ చేయలేదు. మాటాడవలెను గనక మాటాడినాను, అంతే. ఈ సజీవ నాదానికి అనుకొన్నంత పని చేయడానికి తగినంత బలం చాలింది కాదు. అతనిని అనిష్టపు ఊహాప్రపంచంలోనుంచి తప్పించకపోయినది.

అతడు పక్కున వికారపునవ్వు ఒకటి నవ్వి 'నేను ఈలాగున మీ ఎదుట నిలవబడి ఉన్న పాళానఉత్తజీవనదాస్ జ్ఞానినే. కూర్మపురంతుహారాబూతోడబుట్టువ నాభార్యా! నా తోడబుట్టువను ఇప్పటి మత్స్యపురి తుహారాబూకి ఇచ్చి యున్నాము. నా దొరతనంవారు నా కున్నూ నా భార్యకున్నూ కాకుండా చేయడానికి బ్రహ్మప్రయత్నము చేస్తున్నారు. మే మిద్దరమున్నూ కలియకుండా ఉండడమే వారికి శ్రేయస్సుగా కనిపిస్తుంది. లేకుంటే మా బానిసమరదులు ఇద్దరితోనూ కుట్రచేసి మా భార్యాభర్తల కిద్దరికీ కాకుండా ఎందుకు ప్రయత్నం చేయవలెను? తలిదండ్రులు లేక దిక్కుమాలి పొత్తిళ్లలో బిడ్డగా ఉండి క్యారుక్యారుమని ఏడుస్తూ కాలువకట్టను చెట్టుకిందపడి ఉన్నప్పుడు బాధ్యత కలగజేసుకోవలసిన విధి అయినప్పటికీ కావాలని కళ్లుమూసుకున్న వీరికి నా వ్యవహారాలలో జోక్యం కలగజేసుకోవడానికి అధికారం ఎక్కడ కలిగింది? ఎందుకు కలుగజేసుకోవలెను, లాభం లేకుంటేను వీరు? దయ

దలచి క్రైస్తవమత బోధకులు నన్ను తమ గుడిలో చేర్చుకోవడంతోనే నాకు ఈ దౌర్భాగ్యం పట్టిందట. కాదు. ఏ దేశాన్నయితేనేం కొల్లగొట్టగల మహామేధావులు కావాలని వారి నాకు "మిత్రద్రోహి"గా ఉండడానికి ఒప్పు [illegible] నా [illegible] [illegible], బి.ఏ., [illegible], [illegible] నాకు [illegible] [illegible] ఇవ్వడం నాది తప్పా! నాకు విద్యాబుద్ధులు అబ్బడం నాది తప్పా! క్రైస్తవ కళాశాలలో నాకు గురువులుగా ఉన్న విద్వాంసులు నా బుద్ధి కుశలతకు నన్ను మెచ్చుకొని నా "మిత్రద్రోహి"కి ఈ వార్త తెలియపరచడం నాది తప్పా? అతను సంతోషించడం నాతప్పా? ఆయన పెళ్ళిచేసుకోకుండా ఉండవలెనని బాగా చిన్నతనంలోనే నిశ్చయించుకోవడం కూడా నాదే తప్పు! నేనే తనకి తగిన కొడుకునని తెలియపరుస్తూ ఉయిలు మూలంగా అతనికిగల కోట్లకొలది, విలువగల ఆస్తి, స్కాట్లండులోది నాకు చెందజేయడం నాదా తప్పు? తప్పు లేదనుకుంటే ఎందుకీ కుట్ర? ఆ స్తి స్వాధీనం చేసుకోవడానికి స్కాట్లండు వెళ్ళవలెనే! ఎన్నిసార్లు అడిగినా నాకు దొరతనంవారి అనుజ్ఞ దొరకదే! వారివ్వ వల్లకాదంటున్నారే! ఎందుకు? తగిన పదవి లేదనా నాకు స్కాట్లండు వెళ్ళడానికి! లాక్ లూకాయలు ప్రతి అచ్చన్న బుచ్చన్నలు తురగని పరుగెత్తుతున్నారే సీమకు, వారి కెక్కడదీ పదవి నాకు లేనిది! పదవి లేదనడానికి ఉన్న పదవి ఊడ గొట్టడానికి కారకు లెవరు? వీరే! దక్షిణాదిని కళాశాలలో ప్రధానోపాధ్యాయునిగా ఉండకుండా మిషనరీ యాజమాన్యం కల్పించిన్నీ నన్ను అక్కడ నుంచి తప్పించినవా రెవరు? వీరే! నాకు తగిన ఉద్యోగము దొరకకుండా నా ప్రతి ప్రయత్నమునకున్నూ అడ్డుతగిలేవా రెవరు? వీరే! ఇదంతా ఎందుకు? నాకు ఆ ఆస్తి స్వాధీనపడకుండా ఉండవలెనని [illegible]డండి, వారిప్తు! నాకే కాదట, నా పిల్లలకుకూడా ఆస్తి చెందకూడదట! నాకు పిల్లలుంటే వాళ్ళకు ఆస్తి దఖలుపడకుండా చేయడం చాలా ప్రయాసఅని పిల్లలు కలుగకుండా ఉండవలెనని వారు ప్రయత్నంచేస్తున్నారు. నేను ఈ కోస్తాని, నా భార్య ఆ కోస్తాని. తమ స్వలాభంకోసం మా బావమరదులు ఇద్దరుకూడా దొరతనంవారితో చేరినారు. లేకుంటే వాళ్ళకు ఒక్కగడియ వేగదు. ఇంతెందుకు, ఈ దేశంలో ప్రతివాడున్నూ నాకు వ్యతిరేకమే. ఇప్పుడు నాతో మీరు సఖ్యతగా మాటాడుతున్నారా, చూడండి, రేపటినుంచి నేను ఇటువస్తే మీరు అటు వెళతారు. నేను ఎంతమందిని చూచినాను కాను, ఇంతకుముందు? నా నీడ నన్ను వెంటబెట్టినట్టు మఫ్టీకానిస్టబిల్ ఒకడునన్ను ఎప్పుడూ వెంటాడుతూనేఉంటాడు. అదిగో దూరంగా చెట్టునీడను నిలువబడ్డాడు ఏమీ ఎరగని వాడిలాగు. వాళ్ళ ధర్మమా

అని నా ఉన్నతస్థితిని సూచించడానికి ఇది ఒక్క మర్యాదమాత్రం నాకుచేస్తున్నారు. ప్రతి చెడుగులోనూ మంచికూడా ఇమిడి ఉన్నట్టే మంచిలోకూడా చెడుగు ఇమిడి ఉండడం సహజం. ఈ జవాను మనకు ఇద్దరికీజరిగే సంభాషణ దొరతనం వారికి ఈ రాత్రి ఎప్పుడో నేను నిద్రపోతూన్న సమయంచూచి తెలియపరుస్తాడు. వెంటనే బిచ్చపు నాణెములు మీ జేబులో గల్లుగల్లు మంటవి. ఉదయంనుంచీ బిరుదులు తోకలు లాగు తగిలించుకో ఇచ్చును మీరు. ఆ క్షణం మొదలు నా వాళ్ళు కారు మీరు. నాస్వదేశం నాకు కాకిపోతేసరా! స్కాట్లండు నన్ను రక్షించింది కాదూ! అదేవిధాన్ని అమెరికా, ఫ్రాన్సు, జపాన్ దేశాలుకూడా లేవూ? లీగ్ ఆఫ్ నేషన్స్ ఇప్పుడు జినీవాలో కలుసుకొని నాద ప్రతి వాదాలు చేస్తున్నారు కాదూ? ఎందుకు? నా హక్కులను గురించే! వారికి ఇప్పుడు అంతకన్న హెచ్చు ముఖ్యమైనపని ఏమున్నది గనక, తర్జనభర్జన చేయడానికి! నా దొరతనమువారు ఇతర దేశాల ప్రతినిధులకు జవాబులుచెప్ప లేక వలలో చిక్కుకున్న చేపవలె గిజగిజ గింజుకుంటున్నారు. నిన్నటి వార్తాపత్రిక చదవలేదు గాబోలు! ఔను, మీరు వార్తా పత్రికలు చదవరట. విన్నాను. "డబ్బిచ్చి అబద్ధాలు ఎందుకు కొనుక్కోవాలి, ఇవ్వనక్కర లేకుండానే, ప్రతిదినమున్నూ లెక్కలేకుండా వద్దన్నా గాని చెవిని పడుతూంటే" అన్న రస్తా తొక్కిన వాళ్ళలో ఒకరట మీరు! అది తప్పక వాస్తవమే. కాని ఈ దినపత్రిక యందు నిన్నటిపత్రికలో నన్నుగురించిన్నీ, నా వ్యవహారాన్ని గురించిన్నీ వ్రాసిన సంపాదకీయము మాత్రం అక్షరం అక్షరం నిజమే! తక్కినవాళ్ళమాట చెప్పకండి; వాళ్లగురించి మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను గనక. ఇదివరకు మీరు దానిని చదివి ఉండకపోతే ఇప్పుడు ఇంటికి వెళ్ళుతూనే తప్పకుండా చదవండి. ఎవరు ఏమి రుజువులు కల్పించుకొని తెచ్చుకున్నా లీగువారు నాపక్షమే తీర్పుచెప్పాలి, వాళ్ళ కళ్ళకి న్యాయంగా కనబడనీ, కనబడకపోనీ. మా బలాబలాలు వారికి తెలుసునే! నా పక్షాన్ని తీర్పు చెప్పకపోతే ఇదివరకు ఎన్నడూ కననివినని కలహం ఒకటి రాజ్యానికీ రాజ్యానికీ, రాజుకీ, రాజుకీ పుట్టి పోతుంది. అవతల అమెరికా ఇవతల జపాన్, మధ్యను యూరపు. ఒక్కటె యుద్ధభూమి. ఏరోప్లేనులు, స్టీమర్లు, ఫిరంగులు, సోల్జర్లు - ఎక్కడ చూచినాను. అప్పుడు నాదీ రాజ్యం. ఏక చ్ఛత్రాధిపత్యం ఏలుతాను. రావలసిన వారి కందరకీ బుద్ధివచ్చిన తరువాతనే నా ఆస్తిని నా భార్యను నాస్వాధీనం చేసుకుంటాను. నేను బలవంతుడననిన్నీ, ధనికుడననిన్నీ అన్ని రాజ్యాల వారికీ తెలుసును. అమెరికాకు ప్రెసిడెంటుని ఎంచుకోవాలంటే నాసలహా ఉండాలి. ఇండియాలో

వైస్రాయిలు, గవర్నరులు మొదలైన వాళ్లని కొత్తగా వెయ్యాలంటే నా సలహా లేనిదే జరగదు. ఇంతెందుకు, సూర్యచంద్రులనుకూడా గిరగిర త్రిప్పగలను, నా శక్తి చూడండి'' అని అంటూ కళ్లు పెద్దవి చేసి ఊపిరి పూనిస్తూ తనముఖాన్ని గిరగిర కొంతసేపు తిప్పినమీదట దానిని ఆపినాడు.

"చూచినారా, సూర్యమండలం ఎంత గిరగిర తిరిగిందో, ఎంత గిరగిర ఇప్పుడున్నూ తిరుగుతూందో! ఎందుకు ముసిముసినవ్వులు నవ్వుతున్నారు ? నాకు పిచ్చనా ? నాకు గాదు పిచ్చి; నన్ను అనుకున్నవాళ్లకి మీకు. గ్రీకు శాస్త్రవేత్తలు హిందూ శాస్త్రవేత్తలుకూడా భూమి నిలకడగా ఉందన్నారు, తెలుసునా ? దానిచుట్టూ సూర్యచంద్రులు, చుక్కలు తిరుగుచున్నవట, చెప్పినారు తెలుసునా? కొపర్నికీసు, గెలీలియోలు అటునుంచి ఇటన్నారు. సూర్యుడు నిలుకడ; భూమి, నక్షత్రాలు వానిచుట్టూ తిరుగుచున్నవట! ఇందులో ఎవరునిజం? ఎన్నడున్నూ లక్షమందిలో ఒకడికైనా వాస్తవమైన జ్ఞానంలేని ఈ బూటకపు ప్రపంచంలో నిజమైన నిజం ఎవరు నిర్ణయించగలరు? గెలీలియో అది ఏమో చెప్పవలెనని నోరు తెరిచేసరికి అతనిని హత్యచేసినారు. ఎవరు? మహామేధావులు! సర్వజ్ఞాన ధురంధరులు! వీరిదండనకు భయపడిఉండాలి, లేకుంటే ఇద్దరు చెప్పినదీ నిజమేఅని అంటాడో ఐన్‌స్టయిన్! ఒకరి వాదం వాస్తవమైతే ఇంకొకరిది వాస్తవం ఏలాగు కాగలదు అన్నయోచన ఈయనకు తోచకుండా ఉంటుందా? తోచినా, తన మాట నిలవబెట్టుకోవడానికి 'చనలమంతా అన్యోన్యాశ్రియము'అన్న వింతదారితొక్కినాడు ఈయన. భూమిమీద నివసించేవారికి ఈగ్రహం ఎంతవడిగాఉన్న చలనంలో ఉన్నా, చలనంలేకున్నా, ఒక్కలాగే ఉంటుంది చలనంలేనట్టు. కాబట్టి గ్రీకులు, హిందువులుకూడా భూమి, దానితోపాటు తాము నిలకడగాఉన్నట్టు యోచించి, రాత్రింబవళ్లు, నెలలు, ఋతువులు కలుగజేసే సూర్యచంద్రులు భూమిచుట్టూ తిరుగుతున్నవి అన్నారు. భూమండలాన్ని విడిచి, సూర్య మండలంలో తాను ప్రవేశించి, అచ్చట ఉన్నట్టు అనుకున్నాడు కొపర్నికస్. సూర్యమండలం తిరుగుతున్నా దానిమీదను అతడు ఉన్నాడు గనుక, అతనికి దానిచలనం కనబడదు; తాను నిలకడగా ఉన్నట్టే భావించుకుంటాడు. ఈ స్థితిలో ఉన్న అతనికి భూమి, చంద్రుడు, నక్షత్రాలు తిరుగుతున్నట్టు కనబడాలి. రైలు రోడ్డుపక్కని నిల్చొని చూచేవాడికి తాను నిలకడగాఉన్నట్టున్నూ, రైలుబండి నడుస్తున్నట్టున్నూ కనిపిస్తుంది. అదే రైలులో ప్రయాణం చేస్తున్న మరొకడికి పరాకుగా ఉన్నప్పుడు, తాను, తన రైలు బండి నిలకడగా ఉన్నట్టున్నూ, పక్కనున్న చెట్లు, తంతి టపాస్థంభాలు వెనుక

ప్రక్కకు పరుగెత్తుతున్నట్టున్నా అని
పిస్తుంది. మీ అనుభవంలోకి ఇదివరకే వచ్చి
ఉండాలి ఇది. భూమిని విడిచిపెట్టి స్వేచ్ఛా
సంచారం చేయడానికి సిద్ధపడ్డప్పుడు సూర్య
మండలంలోకే అన్నమాటేమిటి, ఎక్కడికి
పడితే అక్కడికే వెళ్ళవచ్చును. మిగత
గ్రహాల మీదికిగాని నక్షత్ర మండలాల
మీదికిగాని వెళ్ళవలెనంటే వాట్లకుకూడా
చలనమున్నదే, అట్టి చలనంవల్ల మనదృష్టి
మార్పును చెంది వాస్తవమును కనిపెట్టజాలదే
అని యోచించి అవకాశంలో ఎక్కడనో
ఎట్టి చలనంలేక నిలకడగా ఉన్న ఒక స్థలం
నుంచి అన్ని మండలాల చలనములున్నా
పరిశీలిస్తే వాస్తవం తెలుస్తుందన్నాడు
ఐన్‌స్టైన్, గడుసువాడు. ఈ స్థితిలో ఉన్న
ఇతనికి అన్ని మండలాలూ చలనంలో
ఉన్నట్టే కనిపిస్తవి. ఒకదానికి ఒకటి
విరుద్ధంగా కనబడే ఈ మూడు అభిప్రా
యాలలో ప్రతి ఒకటిన్నీ కూడా వాస్తవం
అయితే నేనన్నది మాత్రం ఎందుకు
వాస్తవం కాకూడదు? భూమి మీద
నిలుచున్నా, నిలుచో లేదనుకున్నాను.
కాబట్టి దాని చలనం నా దృష్టిని చెడ
నీయదు, నా ముఖం గిరగిర తిప్పినా తప్ప
లేదనుకున్నాను. కాబట్టి దీని చలనం
కూడా నా దృష్టిని చెడదీయదు. కాగా
మిగిలినది ఏమిటి? సూర్య బింబం గిరగిర
తిరుగుతూ ఉన్నట్లు నాకు కనిపిస్తూంది
దానితో సహా మీ ముఖం కూడా తిరుగు
తున్నట్టే ఉంది నా మనస్సుకి. ఐన్‌స్టైన్
చెప్పినది వాస్తవం అయితే నేను చెప్పినది
ఎందుకు కాకూడదు? వాస్తవం అయితే
నన్ను చూచి మీరు ఎందుకు ఇంతకు
ముందు నవ్వవలెను? ఇప్పుడు పిచ్చి ఎవ
రిది మీది కాకుంటేను? బుద్ధి జాడ్యాల
వైద్యశాలకు నాయకుడు భుజంగరావు
పిచ్చివాడు కాకపోతే నన్ను ఆ వైద్య
శాలకు తీసుకుపోయి, ఇల్లిచ్చి, తిండి
పెట్టి, గుడ్డిచ్చి, నెలలకొలదీ మొన్న
మొన్నటి వరకూ పోషిస్తూ దండుగ పో
తాడా? తానే పిచ్చి వైద్యశాలలో వాసం
చేస్తూ ఉంటాడా? ఏమిటో, సరేగాని,
మీ పిచ్చి వదుల్చుకోవడానికి రెండే మా
ర్గాలు. పూర్వపు మార్గం దెబ్బలు తినడం,
ఒళ్ళు పులిసేటట్టు. ఆ మందుకోసం ఎక్కడకీ
పోవనక్కర లేదు. ఇక్కడనే ఉంది, నాదగ్గర,
ఇప్పుడు. లేకుంటే పిచ్చి భుజంగరావుగారి
పిచ్చి ఆసుపత్రికి వెళ్ళుతానంటారా? వారిని,
వారి ఆసుపత్రిని నాకు బాగా తెలుసును-
ఆయనా మంచివాడే; ఆసుపత్రీకూడా
మంచిదే; కాని అక్కడికి పోవాలంటే
కొన్ని మైళ్లు నడవాలి. ఆ బోడికి ఈ బోడి
సలాం అని ఆయనపిచ్చికి మీ పిచ్చికి సరిపో
తుంది అక్కడకు వెళ్ళడానికి నిశ్చయించు
కొంటేను. అక్కడికే వెళ్ళుతానంటారా?
సిఫార్సు ఉత్తరం ఇత్తునా? నా మందు అక్కర
లేదా? రక్షించినారు. నా చాకిరే నాకు
దక్కింది. నా వేళ నా స్వాధీనంఅయింది.

ఇంక క్షణంలోనో క్షణంలోనో దిన వార్తా పత్రిక బయటికివస్తుంది. నా భార్యసంగతి, నా ధనంసంగతి, లీగువారు ఏలాగున నిర్ణయించినారో తెలుస్తుంది. నేను పత్రిక చదువుకోవాలి" అని అంటూ తాను నవ్వులుతూఉన్న చుట్టను నేలకురాల్చి నేను కాలుస్తున్న సిగరెట్టును చట్టున లాగుకొని, గుప్పుగుప్పున నాలుగు పీల్పులు పీల్చి పొగ నాముఖంమీద వదలి చుట్టపీక నామీద పారవేసినాడు. "ఆనుపత్రిక వెళ్ళుతారు కాబోలు, నేను అడిగినానని చెప్పి భుజంగరావుగారిని కనుక్కోండి, ఖండవిల్లి అన్నప్ప వెర్రి కుదిరిందో లేదో" అని "మరచిపోయేరు సుమండీ" అంటూ పరుగెత్తి పారిపోయినాడు అతను.

ఇతడికి జ్ఞానమా? పిచ్చా? ఇవిరెండున్నూ అన్యోన్యాశ్రయం గలవా? ఏకజాతి వస్తువులా?

# నెచ్చెలీ

**మొక్కపాటి సుబ్బారావు**

చిరునవ్వు నేత్రముల
చిందులాడినది
నాజూకు నీ నడక
లోనాట్యమాడినది
ప్రేమదృక్కులు నేత్ర
ముల వెల్లివిరిసినవి
హృదిసుప్తి మేల్కొల్పి
తల్లడిలచేసినవి
కలువపూవులువిచ్చి
కలకలా కిలకిలా

మోవియందున నవ్వు
మిణుగురులు మొలచినవి
హృదివిచ్చి మదిరెచ్చ
రెపరెపా రేఖలై
ఎగసినవి రేగినవి
చెలరేగి ఎగసినవి
పిలిచినా పలుకవా
తలచినా తలచవా
పరితపించెడిప్రియుని
తోడ నేనా పంత
గించు టో నెచ్చెలీ!

# భగ్నహృదయుడు

## వట్టికొండ రంగయ్య

▽

అంకితము : మా ప్రియ 'కృష్ణ'కు

△

శారదశర్వరీ సమయ సాంద్ర వినిర్మల చంద్రచంద్రికా
పూరములోన నేను పరిపూర్ణ కుతూహల చిత్తవృత్తినై
హారిమనోజ్ఞ శ్వేతలలితాంబరముల్ ధరియించి మెల్లగా
మీ రమణీయవీథిని గమించితి త్వన్ముఖదర్శనార్థినై.

మంచశయానవై మధురమంజు లసత్కలకంఠకంఠ రా
వాంచిత రక్తికంఠమున హాయిగ నీవు పఠించుచుంటివో
చంచలనేత్రి నిన్ను గన సంభ్రమలీల గవాక్షవీథి దృ
ష్టించియు నీవు గన్పడమి ఇంచుక భగ్నమనోరథుండనై.

ఎన్నియొసారు లేను భవదీయ గవాక్షము చెంత నిల్చి నిన్
మన్ననతోడ బిల్చుటకు మానస మించుక జంకె; ఎట్టులో
సన్నని కంఠనాదమున సారసలోచన, పిల్చినంతనే
విన్నదనంబు దోప గనిపించితి నంతట ముగ్ధరాలవై.

చీకటివెండ్రుకల్ సరిగ చిక్కువదలించి అమర్చలేదు నీ
కూకటివేణిలో కుసుమగుచ్ఛములన్; మరి కప్పురంపు లే
తాకుల వీడియమ్ము మధురాధర, వేసికొనంగ లేదు; మో
హాకరకమ్రకంచుక మొయారము మీఱ ధరింపలేదుగా!

కంకణముల్ కనంబడవు: కంఠమునన్ కమనీయహేమహా
రాంకము లేమి లేవు; లలితాంశుకమేని ధరింపలేదు; క
ర్ణాంకము లైన లేవు; కనకాంగుళిముద్రియు లేదు; ప్రేయసీ,
కుంకుమబిందు వొక్కటియె గోచర మయ్యె లలాటపట్టికన్!

సొమ్ములు లేని నీయొడలి శోభ రవంతయు తగ్గ లేదు నే
త్రమ్ములలోనిక్రొందళుకు, రమ్యవిలోకన కౌముదీద్యుతుల్
కమ్మనికావిమోవిపయి గంతులు వేసెడు మందహాసముల్
ఇమ్ము ఘటిల్లజేసి మరపించెను ప్రేయసి, అందచందముల్ !

నీమృదుభాషణంబులకె నీరయిపోయెను నామనంబు; ప్రే
మామృతవర్షపాతము లయాచితవృత్తిని నింపినాడ; నీ
యామనికోకిలారవ సమంచితవాగ్ఝరికాకలీస్వనం
బే మది మాటిమాటికి నమేయముగా వినసయ్యె ప్రేయసీ !

ఎందరో సుందరాంగులు వరించి తమంతన తామె ప్రేమతో
ముందుగ కౌగిలించి నను ముగ్ధుని జేయగజాలరైరి: నీ
చెందొవవిందుమోముపయి చిందులు ద్రొక్కెడు పువ్వునవ్వులే
బందము వేసి నన్ను బలవంతముగా కొనిపోవు నేడకో !

ఎక్కడికైనగాని పయనించెద నాకనుదమ్ములందు నీ
చక్కనిమందహాసరుచి సంచయముల్ ప్రసరించునేని; నే
నిక్కపుసౌహృదమ్మమెయి నీసహవాసమునం జరింతు; న
న్నెక్కరణిన్ దయం గనెదొ ఏమియొనర్చిన నిచ్ఛగించెదన్.

ఏమని చెప్పువాడ హృదయేశ్వరి, నిన్నెపుడున్ స్మరించుచున్
నామన సేదొ భావపరిణామములం బడి తెన్ను తెర్వు లే
కేమియొ భావసౌధము లహీనముగా నభమందు గట్టెదున్ :
కాముకచిత్తవృత్తులకు కల్గునె మేరలు జీవితేశ్వరీ !

పారము లేని యీప్రణయభారమహోదధితుంగభంగికా
వారము డోలికాళి ననివార్యగతిం బడి ఊగుచుంటి; ఈ
తీరున నీద శక్తికి నతీతముగా గనిపించె; కోరికల్
శారదవారివాహముల చందమునం గనుపట్టు నెచ్చెలీ !

— 'ప్రణయి' అను కావ్యమునుండి —

# రోజా

## చేకుమళ్ల కామేశ్వరరావు

ఆ రోజా[1]న్ని ఎన్నిసార్లు బండీ తోలలేదు! పొట్టి ఎర్రిద్దుల బరువు బండీ కొండల మీంచి ఊడిన బండరాయిలాగ దొర్లి వచ్చేది. తను ఒక్కడే తోలుతున్నాడా! గూడెం దొరలందరూ వెదుళ్లబళ్లు నిత్యమూ తోలుతూనే ఉంటారు. రోజా మంచి దని కాదు. రోజా మంచి దేమిటీ! మంచిదంటూకూడా ఉంటుందేమిటి! మన్నెంలో రోజాలంతే! వెల్లడి[2] బళ్లదారులా ఇవి! బొర్రిన్నదొరకి తన ఎద్దుకాలుగాక తన కాలు విరిగిం దనిపించింది. ఉపద్రివం కోపమూ, విచారమూ వేశాయి: ఎద్దు బాధ కోసం విచారమూ, గొడ్లని కోసుకుతినేజాతి అయితేయేం; రోజా మీద కోపమూ. దొర ఎద్దు మెడ మీంచి కాడి ఎత్తడం మాట అటుంచి, ఏ బండ రాయి తగిలి ఎద్దు కాలు విరిగిందో ఆరాతిని కసిదీర, కాలు దిమ్మెక్కేవరకూ తన్నేడు. "ఉండు నీ పని చెప్తా" అని కోపం లోపల అణిచేసి చెయ్యిమట్టుకు ఆడించాడు. ఒక క్షణం యోచించగా దొరకి రోజా అంతాకూడా విచిత్రింగా కనపడింది.

"ఈ రోజాలో పుట్టింది లగాయతు ఇప్పటిదాకా కళ్లుమూసుకునే బండీతోలేనా, పిచ్చివాణ్ణై బండీతోలేనా!" అని ఆశ్చర్య మొలకెత్తింది. "దొరలందరూ పిచ్చి వెధవలే! అబ్బా! ఇంతమందీ ఎంత అవివేకంగా బాధపడుతున్నారు! ఊబి[3]లోంచి ఎడ్లతోకలు ఎంతమెలేసి, ఎంతబాధపెట్టి ఈడవలేని వెదుళ్ళబళ్ళని ఈడిపిస్తారు! కోయజాతికి తెలివితేటలు లేకపోవడమే కాకుండా గుండెకూడా లేదుకదా! జంతువుల్ని కోసుకుతినే జాతని నిజంగానే అనిపించుకుంది." అనిబొర్రిన్నదొర తనకికలిగిన నూతనదృష్టితో తన జాతినంతా విమర్శించి ఆశ్చర్యపోయి నిలుచుండిపోయాడు.

దొర శ్రిమపడి దాపటెద్దు మెడతాడు విప్పి కాడి తప్పించాడు. ఎద్దు బాధపడుతూనే లేవలేక లేవలేక మూడుకాళ్ళమీదనిలుచుంది. ఎద్దుని చూస్తూన్నకొద్దీ దొరకి వెర్రిఉద్రేకం పుడుతూంది. రోజా అంతా తలలో సినీమా ఫిల్ములాగ తిరిగిపోయింది. రాజవొమ్మంగిరోడ్డునుంచి రోజా మొదలెట్టింది మొదలు లాగరాయి వరకూ ఆతని కళ్ళముందర మంత్రిశక్తివల్ల వేరుముక్క నడిచినట్టు నడిచింది. మొదట ఒక మనిషికి

1. రోజా=బళ్లదారి. 2. వెల్లడి=Plain. 3 ఊబి=రొంపి.

సరిపోయిన దారిలాగ కనబడే ఆ రోజాలో బండి నడిపించాలి. ఎడ్లతట్లని డొంకలు, కొమ్మలు గీసుకొంటూంటాయి. కొమ్మలు చక్రాల ఆకులమధ్యపడి అడ్డుతాయి. ఒకేసరి, బండికి గూడు ఉండభయం. పక్కకొమ్మలు, పై కొమ్మలు వెదురుగూడుని చదరంత లేకుండా చేస్తాయి. నిరుడు గంగాదేవి జాతరకి దొర తనకూతుర్ని వాళంగి నుంచి తీసుకొస్తున్నాడు. దారిలో కొంతదాకా వాన. వానలో కాస్తాకూస్తో తడిశారు. వాన వెలిసింది. పక్కకొమ్మలకి గూడు చిరిగిపోతూంది. గూడుకి పై కొమ్మలు తగలగా బండిలో కుండెడు నీళ్ళు దిమ్మరించినట్లు పడి వానలోకంటే ఎక్కువగా తడుస్తున్నారు. అదికూడా చాలక ఒక చింతకొమ్మ బండిలోదూరి గూడు గూడూ లేచిపోయింది. కూతుర్ని అది చేతులమీద పెట్టుకుని తెచ్చా మను కున్నాడు బొర్రెన్నదొర. అప్పటిస్థితిచూసి ఒకక్షణం విచారమనిపించింది; కాని అంత కంటే అప్పుడు మరేమీ అనిపించలేదు. ఇప్పుడో! ఆ దృశ్యం తలపుకురాగా ఒంటిని జెర్రులుపాకినట్లు గగుర్లు పరివహించాయి. గూడునితన పొట్టనిపెట్టుకొన్న చింతకొమ్మ ఇంకా అలాగే ఉంది. చూపు మేరదూరంలో నేఉంది. తన వేపే చూస్తూంది. దొర బండి అవతలవేపుకి వెళ్ళాడు. బండి తడికలో ఇరికించిన కత్తి పైకిలాగాడు. బయలుదేరాడు. చింతచెట్టు ఎక్కాడు. ఆ మొండి చింతకొమ్మని రెండుదెబ్బల్లో నేలమీద పడేశాడు. ఎంత పిచ్చికోపంతో కొట్టాడో ఏమిటో! అతను చెట్టుదిగి శాంతించి తిరిగి బండి దగ్గరికి వచ్చాడు. రెండో ఎద్దునికూడా విప్పాడు. ఎడ్లని నెమ్మదిగా ఇంటివేపు తోలేడు. కాలు విరిగిన ఎద్దుకోసం అక్కడక్కడ ఆగుతూ [4]వీధికి రెండుఝాములికి వెళ్ళాడు.

వీధిలో ఉన్న చుట్టాలంతా ఎద్దుని చూశారు. "ఓస్! ఇంతేరా!" అన్నారు. బొర్రన్న దొర కడుపులో ఉన్నసంగతి ఎవరికీ చెప్పలేదు. కోయదొరాయె! కళ్లతోనేగాని నోటితో మాట్లాడతాడా! అందులో ఉద్రేకంమీద ఉన్నాడు. గూడెం దొరలంతా ఎద్దునిచంపి పంచేసుకున్నారు. ఆ సాయంత్రం మరో ఎద్దుని కూడా తోలుకువెళ్లి బండి వెదురు ఏలేశ్వరంలో సాహుకారికి బొర్రెన్నదొర అప్పచెప్పాడు. సాహుకారు "ఎప్పుడు మళ్లీ తోలుకొస్తావు?" అన్నాడు. "ఏమో!" అన్నాడు దొర ముక్తసరిగా. "అదేమి?" అన్నాడు శెట్టిగారు. "ఎద్దుకాలు విరిగిపోయింద" అన్నాడు దొర, కోయ యాసతోటి. ఏమెద్దు, ఇదా, మరొకటా, ఎక్కడ, ఎంచేత, ఎప్పుడు అనేవిషయాలు

4 వీధి = ఒకే కోయపల్లిలోని కొన్ని ఇళ్లగుంపు.

శెట్టి అడగాలేదు, దొర చెప్పాలేదు. సాహుకారు "మరొక దానితో తీసుకురా" అన్నాడు. దొర మాట్లాడలేదు. శెట్టిగారు అంతకంటే అడగలేదు. వాడే తెస్తాడని ఊరుకున్నాడు. వెదురు దింపేసి బొర్రచిన్నదొర సాయింత్రం గూడానికి బండితోలుకు పోయాడు. బాపన్న దొర "అన్నా! వెదురి కెప్పు డెళదాంరా?" అన్నాడు. "రాను" అన్నాడు బొర్రచిన్నదొర. "ఏంరా?" అని ప్రశ్నించాడు బాపన్నదొర. "చెప్పుతాను లే" అన్నాడు దొర.

మన్నాడు పొద్దున్న బొర్రచిన్నదొర మచ్చబుడప[5] అవతల ఉన్న తన చలకకి మామూలు ప్రకారం వెళ్ళి గంటెలచేను ఏపుగా ఉండడంచూచి ఆనందపడ్డాడు బొర్రచిన్న దొర. ఇప్పుడున్న కొత్తమోచనలమీద చేనుమధ్య ఉన్న మోళ్ళు[6] తలపుకివచ్చాయి. ఆశ్చర్యపడ్డాడు. తను అంతవరకూ మనిషేనా అనుకొన్నాడు. "కాని వాటిపని ఇప్పుడుకాదు. మరొకసారి వేళ్ళతో పెళ్ళగించి పారేస్తాను" అనుకున్నాడు. అతను తిరిగి ఇంటికి వచ్చాడు. గంటెలజావ తనూ పెళ్ళాము అర్ధాకలిగాతిన్నారు. వేటకి వెళ్ళే అదను గాకపోవడంచేత మాంసం లేదు. గంటెలచేను పండాలి, మళ్ళా కడుపునిండా తినాలి. గంజతాగేక దొర గోచి తిన్నగా పెట్టుకున్నాడు. కోయవాడికి ఒంటిమీద ఉండే గుడ్డముక్క అదొక్కటే. కత్తితీసుకొని అనుకున్నపనిమీద బయలుదేరాడు. గూడెంముందర రోజాలోఉన్న తాటిమొక్కల కమ్మలు కొట్టేశాడు. ఎగువనిఉన్న ఊడుగుచెట్ల మెరుస్తూన్న ఆకులకొమ్మలు రోజామీదికే వాలిఉన్నాయి. ఆకొమ్మలు నరికేశాడు. ఆపైని నల్లరేగికొమ్మలు రోజాని పైనుంచి కప్పుతున్నాయి. నాలుగు దెబ్బల్లో చెట్టునేనరికి అవతలపారేశాడు. చెట్లునరికే నేర్పు కోయవాళ్ళది. అందులో బొర్రచిన్నదొరది. ఎగువని రోజాలో చకార్లిలగాళ్ళు లోతుకిపోయి మధ్యనిమనిషి కూచునేవలకి తగులుతూన్నదిమ్మ ఒక అరఫర్లాంగు మేరవరకూ ఉంది. "దానిపని ఇప్పుడుకాదు. మొదట కొమ్మలపని. తర్వాత మోళ్ళపని. ఆ తర్వాత దిమ్మలపని. ఆ తర్వాత రాళ్ళు ఏరెయ్యడం. అటు తర్వాత బండరాళ్ళపని. ఆ పైని ఊబిపని" అనుకున్నాడు దొర. కాని అంతట్లోనే అతనిబుద్ధి మారిపోయింది. "అన్నీ చేసుకుంటూనే రాజవొమ్మంగిరోడ్డు జేరుకోవాలి" అని గభీమని నిర్ణయించుకున్నాడు. వెంటనే తాను బాగుచేసినంత మేరలో పడిఉన్నరాళ్ళు ఏరెయ్యడానికి పూనుకున్నాడు.

5 బుడప లేక బొడప = చిన్నకొండ, 6 మోళ్ళు = వ్యవసాయంచెయ్యడం కోసమని అడివిని నరుకుతారు. చెట్లని మొదలంటా తెగకొట్టక గజమెత్తు ముక్కలుంచేస్తారు. ఆ ముక్కలికి మోళ్ళనిపేరు.

ఆరాళ్లు కంటికి కనపడగా బొర్రిన్నదొర కడుపు నిండా నవ్వుకున్నాడు. అసలే కోయవాని నవ్వు. అందులో బొర్రిన్న దొరది సాటిలేని నవ్వు. కొంతసేపటికి చిరునవ్వుకి తగ్గింది. "ఈరాళ్ల మీదే కదా నా ఎడ్లునడిచేవి. నా బండీ ఎగిరి కింద పడేది. ఇన్నాళ్లూ ఎలా నడిపించాను అబ్బా!" అని దొర ఆశ్చర్యపడ్డాడు. అతను తనలో వనదేవత ప్రవేశించిందేమిటి చెప్మా అని ఎంతో ఆశ్చర్యపోయాడు. తర్వాత అతను ఆరాళ్లను ఏరి అడివిలో ఇటూ అటూ పారేశాడు. పెద్దకొండ అవతలికి సూర్యుడు చల్లగాజారాడు. ఎక్కడో మైలు దూరాన్ని అడివిలో గాలి వీచడం బయలు దేరిన చప్పుడయింది. గువ్వలజతలు గూళ్లకి ఎగిరి పోతున్నాయి. బుడప విడిచి బండలు[7] చేలకోసం వెతుకుతున్నాయి. బొర్రిన్న దొర గుడిసెకి బయలు దేరాడు. చేరుకున్నాడు. ఎవరినీ పలకరించలేదు. ఏదో ఇంత గంజితాగేడు. గంటెల చేనుని జీవాలు[8] పాడి చెయ్యకుండా వడిసెలతోటీ, కత్తితోటీ చేను కాపలాకి బయలు దేరాడు. వెన్నెట్లో గంటెల చేను నిశ్శబ్దంగా చల్లని మంచు తాగుతూంది. దొర అరప[9] ఎక్కాడు. మధ్యమధ్య చప్పుడు చేస్తూన్న దుప్పుల్ని, కొండ గొర్రెల్ని, కణుసుల్ని, అడివిపందుల్ని, కుందేళ్ళనీ కేకలతోటీ, డబ్బా రేకులతోటీ, వడిసెల తోటీ బెదిరిస్తున్నాడు. ఆపని ఆపేటప్పటికి రోజా ఎలాగ బాగుచెయ్యాలి అనేదృష్టి. తెల్లవారుతూండగా దొరకి మంచి నిద్రపట్టింది. పొద్దెక్కి కాని లేవలేదు. వీధికి బయలుదేరాడు.

అసలే కోయదొర. అందులో ఇప్పుడు పనిమీదఉన్నాడు. ఇంక అసలు మాట్లాడి తాడా! మూగినోముపట్టేశాడు బొర్రిన్నదొర. మునసబు లచ్చన్నదొర బొర్రిన్న దొరని పలకరించాడు. బొర్రిన్నదొర నోట్లోంచి ఏవో రెండుమాటలులాగి ఆరై[10] గారు వస్తారంటూ మునసబు వెళ్లిపోయాడు. బొర్రిన్నదొర దూడనివిప్పి ఆవుని పాలుపితికేడు. గిద్దెడుచుక్కలూ ఆరై గారికోసం మునసబు ఇంటికి పంపాడు. దొర రోజుకి ఒకసారే పాలు పితుకుతాడు. అసలు అతని ముందుతరంవాళ్ళు ఆవుల్ని పాలు పితుకుతారని ఎరగరు. దూడలకోసమే ఆవుల్ని పెంచడం. ఇప్పుడు రవ్వంత తెలుగు మీరి వీధిఅంతా పాలు పితుకుతున్నారని ముఠాదారు[11] గోలచేస్తున్నాడు. ఇంతక వీధిఅంతా పాలుపితికితే రోజుకి రెండుశేర్లుఅవవు. బొర్రిన్నదొర ఆవు పాడిగల ఆవుల్లో

7 బండలు=కోతులు. 8 జీవాలు- జంతువులు. 9 అరప-మంచ. 10 ఆరై - R. I. (రెవిన్యూ ఇనస్పెక్టరు). 11 ముఠాదారు = కొన్ని గ్రామాల జమీదారు.

ఒకటి. గిద్దెడుపాలు ఇస్తుంది. మరికొంతసేపటికి దొర వేలువిడిచిన చెల్లెలికొడుకు ముర్రెందొర వచ్చాడు. గొడ్లని విప్పి అడివికి తోలుకుపోయాడు.

బొర్రిన్నదొర పాదు 12 పైకితీశాడు. గంటెలు పేరుకే ఉన్నాయి గుడిసెలో. పిట్టలేక పోతే మాడడమే. అంచేత పాదు పైకితీసి ఉచ్చులికి ఆమడం రాశాడు. కత్తి, గునపం, పార ఒకచేత, రెండోచేతిల్లో చదలకోడి—షికారీపిట్ట 13 —పంజరం, పాదు, పట్టుకుని బయలుదేరాడు. రోజామీద గునపం, పార విడిచిపెట్టి, కత్తి ఒకచేత, పంజరం, పాదు రెండోచేత్తో పట్టుకుని అడివిలోకి ఫర్లాంగుదూరంవెళ్ళి ఎత్తుపల్లాలు లేనిచోట పాదు అమర్చి గంటెలుచల్లి కైవారం మధ్యని షికారీపిట్ట పంజరంపెట్టి పదిగజాల దూరంలో వెదురుపిడెం 14 పక్కని దాక్కున్నాడు. మరికొంతసేపటికి షికారీపిట్ట కూత మొదలెట్టింది. అడివిచదలకోళ్ళు వచ్చాయి. పాదుమధ్యని వాలేయి, బొర్రిన్నదొర నెమ్మదిగా చప్పట్లు కొట్టాడు. హుష్, హుష్ అన్నాడు. కోళ్ళు పరుగెత్తాయి. రెండుకోళ్ల మెడలుఉచ్చుల్లో చిక్కుకున్నాయి. రెండుతప్పించుకుపోయాయి. చిక్కుకున్నకోళ్ల మెడలు నులిమేసి మంగలంలో పెట్టి వస్తువులు తీసుకొని రోజాదగ్గరికి వచ్చాడు. సాయంత్రంవరకూ దిమ్మసని పట్టించాడు. మట్టిదిమ్మ అయినా చిట్టంరాయిలాగ ఉంది. అంచేత యెంతో శ్రమపడ్డాడు. సాయింత్రంవరకూ ఒళ్లు హూనం చేసుకొని కొంత పనిచేశానుకదా అని పరమానందం పొంది, పనిచాలించి గూడానికి బయలుదేరాడు.

దొర పనిచేస్తూన్నప్పుడు ఫుల్లన్నదొర అడివిలోనే కలపకొడుతున్నాడు. బొర్రిన్న దొరచేస్తూన్నపని అంతా అతను చూశాడు. అతను గూడెంలో అంతా చెప్పాడు. మునసబు బొర్రిన్నదొర దగ్గరికి వచ్చాడు. "అన్నా! మనకెందుకా పని. సర్కారోళ్లు చేసుకుంటారు. ఎందుకా పని మనికి ఊరుకో" అన్నాడు. బొర్రిన్నదొర "ఎద్దుకాలు విరిగింది" అని ఒక్కముక్కలో సమాధానమిచ్చాడు. "నీకు తెలియదూ! ఎద్దుకాలంటావు! ఎన్నిసార్లు బళ్లు తిరగబడిపోలేదు! ఎన్నిసార్లు ఎద్లు చావలేదు! ఎన్నిసార్లు చక్రాలు విరిగిపోలేదు! నీకు తెలియదూ! నీ ఎద్దంటావు!" అని ఆక్షే

12 పాదు=వెదురుబద్దలతో ఆరడుగు ఎత్తుగాను, రెండడుగులు పొడుగుగాను, కట్టబడ్డ చట్రాలు ఒకదాని కొకటి లంకవేసి ఉంటాయి. ఈ చట్రాలమధ్యని తాళ్లతో అల్లబడి ఉచ్చులు ఉంటాయి. 13 షికారీపిట్ట=పంజరములో ఉంచబడిన పిట్ట. ఇది అరవగానే ఇతరపిట్టలు వస్తాయి. అవి పాదులో చిక్కుకుంటాయి. ఈ పనికోసం తయారుచేయబడ్డ పిట్ట. 14 వెదురుపిడెం=వెదురుపొద.

పణగా అన్నాడు. "మన తెలివి అలాగుంది. రోజా బాగుంటే" అన్నాడు దొర. "యుగయుగాలనుంచీ లేంది ఇప్పుడు వచ్చిందా" అన్నాడు మునసబు. బొర్రిన్నదొర తానుచేసిన పనిని గురించి ప్రశంసకోసం తొందరపడుతున్నాడు. కాబట్టి "తమ్ముడూ! వీధిముంగల రోజా ఎలాగుంది" అన్నాడు "దానికేం. గచ్చురోడ్డులా గుంది" అన్నాడు మునసబు. దొర ఉబ్బిపోయాడు ఆనందంతో. అసలే నోరు మూత పడిపోయింది. మరికొంతసేపు ఇద్దరూ ఫారెస్టు ఇలాఖావాళ్ళనిగురించి మాట్లాడుకొని ఎవరిదారిని వారు వెళ్ళిపోయారు.

బొర్రిన్నదొర కొన్నిరోజుల్లో దిమ్మని చెక్కేసి దాని అవతలఉన్న ఊబిని బాగు చెయ్యడం మొదలెట్టాడు. ఆ ఊబిలో బండీచక్రాలు కుంచంవరకు దిగబడిపోతు న్నాయి. దొర కష్టపడి రాళ్ళు మోసి ఆ ఊబిలో పడేశాడు. దానిమీద ఇంత మట్టి పోశాడు. ఊబి కప్పడిపోయింది. ఆ స్థలంమీంచి బళ్ళు సాఫుగాపోతూండగా అతను చూసి పట్టలేని ఆనందంపొంది గంగాదేవిని ధ్యానించాడు.

ఎగువని కొంతవరకు రోజామధ్యని చెట్లమోళ్ళు ఉన్నాయి. ఈ మోళ్ళు ఒకొక్క ప్పుడు ఎడ్లకాళ్ళకి తగులుతాయి. ఒక్కొక్కప్పుడు చక్రాలకి తగులుకొని నానా ఇబ్బందీ పెడతాయి. కొన్నాళ్ళపాటు బహుశ్రమపడి ఆ మోళ్ళని ఒకటితర్వాత ఒకటిగా నేల మట్టంచేశాడు దొర.

గంటెలచేను పంటకివచ్చింది. పండిళ్ళని, దమలని, పొదలసిబిరకాయలు, పొట్లకాయలు ఆనపకాయలు కాస్తున్నాయి. వాటివాటి పండగలు చేసుకుంటేనేగాని అవి తిన కూడదు. ఎన్నిపండితే ఏమిటి! ఒకనాటి సాయింత్రం దొరసాని "ఇంట్లో ఏ గుడ్డూ లేదు" అంది. దొర మాట్లాడకుండా గజం[15]తో తుపాకీలో మందు దట్టించి గుండు పడేసి చలకకి బయలుదేరాడు. తెల్లారేవరకూ చేను కాపలాకాసి, చేను చుట్టూ పరి శీలించి అంతకి కాస్సేపు కిందటే దుప్పి నడిచి పోయినట్లు గడ్డిమీది మంచు బొట్లని చెదర గొట్టిన అడుగుల్ని చూసి, తెలుసుకొని, తుపాకీకి కేపు తగిలించి, అడుగుల జాడనే మచ్చ బొడపకి వెళ్ళాడు. ఏభై గజాల దూరంలో పాలమొక్క పక్కని ఒంటి దుప్పి[16] మేస్తూంది. ఒళ్లు పరవశమయి పోయింది. కడుపునిండిపోయిం దనుకున్నాడు.

15 గజం=తుపాకీలో మందు దట్టించే ఇనప ఊస. 16 ఒంటిదుప్పి=తన గుంపులోనుంచి తప్పిపోయి విడిగా తిరుగుతూన్న దుప్పి. ఇది మంచి బరువుగా ఉంటుంది. అలాగే ఒంటికణుసు, ఒంటిపంది, ఒంటి గొరపోతు మొదలైనవి.

మీటు నొక్కాడు. దుప్పి కింద పడిపోడం కోసం చూశాడు. కాని, కాని, సన్న మందు[17] నిలగాలింది.[18] మీటు చప్పుడికే దుప్పి ఉడాయించింది. తుపాకీ 'ఢాం' అంది, పక్షులు గోలచెయ్యడానికి మాత్రమే! దొర ఆశ్చర్యంతో నిలబడి పోయాడు. ఎప్పుడూ ఎరగడు అలాగ తప్పిపోడం. "కోసలమ్మకి నామీద దయలేదు" అనుకున్నాడు. గుడిసెకి బయలుదేరాడు. వెల్లటినుంచి మన్నెంలో మేపడానికి తోలుకొచ్చిన గొడ్లలో ఒకదాన్ని గూడెంలో సఫా చేశారు. బొర్రిస్నదొర కడుపుకూడా నిండింది.

తను కొట్టేసిన దిమ్మకి ఎగువని రోజాకి అడ్డంగా కాలవ[19] పారుతూంది. కాలవలో వెనకఎప్పుడో రాళ్లువేశారు, బళ్లు సుళువుగా వెళ్ళడానికి. ఇప్పుడారాళ్ళన్నీ ఇష్టంవచ్చినట్లు పడిఉండి అవి లేకుండా ఉంటేనే బండి ఎంతో బాగానడుస్తుం దని పిస్తున్నాయి. దొర నాలుగురోజులపాటు శ్రమపడి ఆరాళ్ళనన్నిటిని తవ్వి తీసి, పేర్చి దారి మళ్ళా చక్కగాచేశాడు. దానిమీంచి బళ్లు సుఖంగా వెళుతూంటే అతను బ్రహ్మానంద పడ్డాడు.

కాలవలోకి దిగేదారి అటుగాని ఇటుగాని ఏమీ బాగాలేదు. ఒకవైపు ఎంతో ఎత్తుగాను, రెండోవైపు ఎంతో పల్లంగాను ఉండి పైగా ఎంతో నిటారుగా ఉన్నాయి. బళ్లు బోల్తాకొట్టడమే తరుచాయి. ఎత్తుగా ఉన్నవేపు తవ్వేసి ఏటవాలు ఎక్కువ చేశాడు. పల్లంగా ఉన్నవైపు రాళ్లుపడేసి దారి సాపుచేశాడు. రోజాలోనే ఒకచోట ఒకపెద్ద బండరాయి నేలలోనుంచి పుట్టుకొస్తూంది. దానిపక్కనే చిన్నచిన్న రాళ్ళు అనేకం ఉన్నాయి. "అది రేపటినుంచి మొదలెట్టాలసిన పని" అనుకున్నాడు దొర. మన్నాడు పొద్దున్న ఉలితోటీ, సుత్తితోటీ వెళ్ళి మొదట కొన్ని చిన్నరాళ్ళని సాపు చేశాడు. ఒక్క చిన్నరాళ్ళని సాపుచెయ్యడమే వారంరోజులు పట్టింది. ఆ తర్వాత పెద్దరాయిపని పట్టించాడు.

గూడెందొరలంతా అనుకున్నారు — బొర్రిన్నదొరకి పిచ్చెత్తిందని. ముఠాదారు రోజాలో కొంత మార్పుచూసి కారణమేమిటని వాకబుచేసి, బొర్రిన్నదొరకి పిచ్చెత్తిందని తెలుసుకొని ఒక పిసరు విచారించి, "ఏదయితేయేం? మనుష్యుల్ని

17 సన్నమందు=తుపాకీ గొట్టంలో మందుకీ కేపుకీమధ్యనుండే మందు. 18 నిలగాలింది=నెమ్మది నెమ్మదిగా కాలింది. 19 కాలవ = వాగు.

కొట్టకుండా ఇదీ మంచి ఉద్యోగమే. ఎవరికీ అపకారం లేనిపని ఏదో చేస్తున్నాడు. బాగానే కాలక్షేపం మవుతూంది'' అన్నాడు.
రోజామీద వాలిన కిందికొమ్మలూ బండీగూళ్ళక తగిలే పైకొమ్మలూ, తెగ్గొట్టి రోజా బాగుచేస్తున్నాడు బొర్రిన్నదొర.

గూడెంచుట్టూ ఎంతో గాబు[20] ఉంది. గడ్డిమొక్కలూ, తుప్పలూ, పుట్టలూ నానా గాబుగానూ ఉంది. బొర్రిన్నదొర ఈ మధ్య దాన్నిచూసి అనేకసార్లు పెదిమివిరిచాడు. దొర రోజా బాగుచెయ్యడం మొర్రెందొర చూశాడు. మొర్రెందొర వయస్సు ఆట్టే లేదు; పదిహేనేళ్ళు. పెద్దకళ్ళు, త్రికోణంముక్కు, పెద్ద పెదిమెలు, జుంజురుజుట్టు, పొట్టిగా సూనులాగ ఉంటాడు. అతను దొరతో "మామా! గాబు సంగతేమిటి" అన్నాడు. దొర పెదిమివిరిచాడు. "నేనున్నాను'' అన్నాడు మొర్రెం దొర, గుండెలమీద చెయ్యివేసుకుంటూ. తీరుబాటులేదన్నట్టు దొర ఊరుకుని బుర్ర తిప్పేశాడు. "అలాగకాదు. మా గాటుజట్టు[21] తయారవుతాం'' అన్నాడు మొర్రెం దొర. దొర మొహం ఇటువైపు తిప్పాడు. మొహాన్ని మందహాసం ఉదయించింది. "అయితే నువ్వక్కడ కూచుంటేచాలు, మా గాటుజట్టు పనిచేసుకుపోతాం" అన్నాడు బుల్లిడి[22] ధీమాగా. దొర అప్రియత్నంగా బుర్ర ఆడించాడు. మొర్రెం రెడ్డి సంతోషంతో పరిగెట్టి కొన్ని గుడిసెల దగ్గరికి వెళ్ళి కుర్రకారుని పిలుచుకొచ్చాడు. బొర్రిన్నదొర తన మనస్సులో ఉన్న కోరిక ఫలిస్తూందని ఉబ్బిపోయాడు. మర్నాటినుంచి పనిచేస్తామని గాటుజట్టంతా దొరనిఒప్పించారు. వారంరోజుల్లో గూడెం చుట్టూ నూరుగజాలవరకూ పరిశుభ్రం చేసేశారు. మొర్రెందొర "ఇప్పుడు పాముల్ని గాని, దోమల్నిగాని, నక్కల్నిగాని రమ్మను" అన్నాడు. బొర్రిన్నదొర తనకడుపు నిండిపోయినట్టు ఆ శుభ్రమైన స్థలాన్నిచూసి ఆనందంపట్టలేక అక్కడే చతికిలపడ్డాడు. కుర్రమూక అంతా అతనిచుట్టూ చేరింది. అర్ధరాత్రిదాక బోలెడన్ని కబుర్లు చెప్పుకున్నారు.

బొర్రన్నదొర ఎప్పటిపనిమీద బయలుదేరాడు. వెంట కుక్కకూడా వస్తుంది. ఎడమవైపు రిజర్వు అడివి. కుడివైపు మామూళ్ళు అడివి. రోజామధ్యని ఒక తెల్ల మద్దిమోడు ఉంది. దాని పెద్దవేళ్ళు నేలపైనిఉండి, రాళ్ళకంటే ఎక్కువ బాధపెడుతున్నాయి.

20 గాబు=చెత్తమొక్కలూ వగైరా. 21 గాటుజట్టు= కుర్రజట్టు (గాటు=పన్నెండేళ్ళకుర్రాడు,)
22 బుల్లిడి=పదిహేనేళ్ళ మొగాడు.

మోడుచుట్టూ ఊరికేచూశాడు. చీమలపుట్టని రాత్రి బంటి[23]బరికింది. ఈమోడుని తెగ్గొట్టాలని నిర్ణయించుకున్నాడు. ఇంతట్లో కుక్క బేజారెత్తిపోయి మొరిగింది. బొర్రన్నదొర వెనకా ముందూ చూశాడు. ఏమీ కనపడలేదు. రెజర్వు అడివివైపు చూశాడు. పచ్చనిఆకులగోడలోంచి కనపడేదేమిటి! అయినా పరిశీలించి చూశాడు. తనకిముందు అయిదుగజాల దూరంలో ఏదోజంతువు ఆకులు, కొమ్మలలో కలిసిపోయినట్టు కనబడింది. "మెకమా[24]ఏమిటి!" అనుకుని పనిమానేసి నిలుచున్నాడు. మరికాస్త పరిశీలనగా చూశాడు; బండీచిందువు[25]. "మెకంతో సమానమైనదే!" కుక్కనిఎత్తుకుపోకుండా దగ్గిరకిలాక్కుని బుజ్జగించి, గొడ్డలితోటీ, కత్తితోటీ, కేకలతోటీ చప్పుడు చేసి, బెదిరించి, బండీచిందువుని తోలేశాడు. మూడురోజులు తీసుకుంది, ఎండిపోయిన ఆ తెల్ల మద్దిమోడు నేలమట్టమవడానికి.

ఎగువని కొజాలో ఒకచోట ఒక సలభై గజాలమేర ఆరికచేనులోంచి మరొకదారి తీశారు బళ్ళవాళ్లు. ఎంచేతంటే అంతకిమునుపు ఉన్నదారిలో ఒకవైపు బాగా గాడీ ఏర్పడిపోయి బండీతోలితే కుంచం నేలమీద రాసుకుంటోంది. అందుకని బళ్ళవాళ్లు మరొకదారితీసి మళ్లా కొంత ఎగువని కొజాలో కలిపేశారు. కొత్తదారి సుఖంలేదు. రాళ్ళు, డొంక[26], పుట్టలు. బొర్రన్నదొర నాలుగురోజులు కష్టపడి అక్కడక్కడి రాళ్ళుతెచ్చి ఆగాడీ నింపి దానిమీద మట్టిపోసి చదునుగా తయారుచేశాడు. బళ్ళవాళ్ళు మళ్లా ఈదారినే రాకపోకలు సాగించారు. వాళ్ళనిచూసి దొర పొట్ట చెక్కలయేటట్లా నవ్వుకున్నాడు. వీళ్ళు మనుష్యులేనా అని విస్తుపోయాడు. "కాస్త కష్టపడి దారి బాగుచేసుకోలేకపోయినా దారి బాగుపడితే మళ్లా ఆదారినే వస్తారు. తెలివితక్కువ దద్దమ్మలు. కొంత శ్రమపడితే ఎంత సౌఖ్యపడతారో ఎరగరు. తమ పనికానట్టూ, తమకి సంబంధంలేనట్టూ, తమ ఖర్మమే ఇంత అన్నట్టూ ఊరుకుంటారు" అనుకున్నాడు దొర తన నూతనసృష్టిలో.

ఒకరోజు పొద్దున్న మొర్రెందొర బొర్రన్నదొర ఇంటికివచ్చాడు. "మామా! నీకు సాయంచేద్దామంటే గొడ్లనికాచేవాళ్లెవళ్లూ! నువ్వు ఒంటరిగా తంటాలుపడుతూంటే నామనస్సెంతో బాధపడుతూంది. పెద్దోళ్ళకి చెప్తే వాళ్లకితెలీదు. పైగా మనం చేసేదే తప్పని బోధపరచబోతారు. నాకేమీ తోచటంలేదు" అన్నాడు మొర్రెం

23 బంటి— ఎలుగుబంటి. 24 మెకం= పెద్దపులి. 25 బండీచిందువు = చిరుతపులులలో ఒకరకం. పెద్దపులంత ఉంటుంది. మెడచుట్టూ నల్లటిగీత ఉంటుంది. 26 డొంక = చిన్న చెట్లగుంపు.

దొర. బొర్రిన్నదొర ఆవిషయమై మాట్లాడలేదు; ముర్రిందొర సానుభూతే పది వేలని లోలోపల సంతోషించాడు. రాజవొమ్మంగి సంతలో వస్తువుల్ని గురించి కాసేపు ముచ్చటించాడు. దొర తనపనిమీద లేచాడు. ముర్రిందొర గొడ్లని విప్పడానికి పోయాడు.

రోజూసి అంటిపెట్టుకునే తాడిచెట్టొకటి ఉంది. ఇవతలవైపు బండరాయి, అవతలవైపు చెట్టు! ఈ ఇరుకులోంచి బళ్ళువచ్చేటప్పుడూ వెళ్ళేటప్పుడూ అతిజాగ్రత్తగా నడిపిస్తేనే తప్ప ఇరుసు తాడిచెట్టుకి తగులుకుంటుంది. అక్కడినుంచి నానా పీకులాట. బొర్రిన్నదొర ఈరోజున చెయ్యాలనుకొన్నది తాడిచెట్టుని నేలమట్టం చెయ్యడం. క్రితం రాత్రి చిన్నజల్లుకొట్టింది. ఆ వాతావరణానికే దొరంతా చిత్తడిగా ఉంది. చలిగాలి వీస్తూంది. పొద్దున్న సూర్యుడిఎండలో చెట్లనిండా ఆకులు గాజుముక్కల్లా మెరుస్తున్నాయి. బొర్రిన్నదొర చద్దిగంజితాగి కత్తి, గొడ్డలి పుచ్చుకుని బయలుదేరాడు. కుక్కకూడా వెంటవస్తూంది. తొందరేమీ లేదు. వెనక్కితిరిగి తాను బాగుచేసిన దారి కనపడినంతవరకూ చూసి తల పంకించి, గొడ్డలితో చెట్టుపని మొదలెట్టాడు. కొంతసేపు కొట్టాడు. ఎంచేతో ఏమో అలసటలా అనిపించింది. కూచున్నాడు. కుక్కని దగ్గరికి లాక్కుని కాసేపు దానితో ఆడుకున్నాడు. మళ్ళీ లేచాడు. గొడ్డలితో రెండుదెబ్బలు కొట్టాడు. చెట్టు కిరకిరమంది. చెట్టులో ఉడతలుచేసిన తొర్ర ఉందనేసంగతి దొరకి తెలియదు. ఇంకా ఎన్నో దెబ్బలు కొట్టాలి పడదనే తలంపుతో ఉన్న దొర నమ్మకంలేక అక్కడే నిలుచున్నాడు. చెట్టు తనవైపే వంగుతూంది. కిందికి వచ్చేసింది. దొర చేతులు పైకెత్తాడు, ఆపడానికి అన్నట్టు. చెట్టు మీద పడిపోయింది. దొర మాంసం ముద్దయిపోయాడు. కుక్క దగ్గిరికి వచ్చింది. వాసన చూసింది. మళ్ళీ కొంచెందూరంలో కూచుంది. కొంతసేపు చూసింది. దొర లేవలేదు. దగ్గిరికి వచ్చి మళ్ళీమళ్ళీ మూచూసింది. కెవ్వుమని కేకవేసి ఏడుపు మొదలెట్టింది. పుల్లలకోసం ఆదారినే వెళుతూన్న లచ్చన్న దొర బొర్రిన్నదొరని చూసి ఏడుస్తూ గూడేనికి వెళ్ళిపోయాడు. మరొక అరగంటలో గూడెమంతా బొర్రిన్న దొర శవందగ్గిరే ఉంది. అంతా గోలపెట్టారు. "పిచ్చివాడు చచ్చిపోయా" అన్నారు పెద్దవాళ్ళు. "బొర్రిన్నదొర దేవుడయ్యాడు" అన్నారు కుర్రకారు. రకరకాల అడవి పువ్వులు, పత్రి గంపలతో తెచ్చి బొర్రిన్నదొరని పూజచేసి ఆ స్థలంలోనే గొయ్యి తీసి దొరని సమాధిచేశారు. దానిమీద ఒకరాయి పడేశారు. బొర్రిన్నదొర చేష్టలు చెప్పుకుంటూ అంతా గూడానికి బయలుదేరారు. కుక్కమాత్రం సమాధి

దగ్గిరే ఉండి అరుస్తూంటే ఎవడో దొర దాన్ని చెవిపట్టుకుని లాగాడు. రాలేదు. మరొకడు "అదే వస్తుంది పోరా" అన్నాడు. కుక్క చెవి విడిచిపెట్టేశాడు. అది తిరిగి సమాధిదగ్గిరికి వెళ్ళి ఏడవడం మొదలెట్టింది.

మొరెల్గిందొర కురసజ్జుతో అన్నాడు "బొర్రిస్న దేవుణ్ణి తలుచుకుంటే ఒంటిని మైకం కమ్ముతూంది" అని. మల్లిదొర "ఇంతవరకూ కోయకులంలో అటువంటివాడు పుట్టలేదు, మహాత్ముడు" అన్నాడు పరవశంతో. దొరకి పండగచెయ్యాలి అన్నాడు బాలుదొర ఉత్సాహంగా. "రోజా మాటేమిటి" అన్నాడు మొరెల్గిందొర గంభీరంగా ఆపని దొరకిష్టమయినదని. "మూడో వంతు సగాత్రిమే మిగిలింది" అన్నాడు సంకులమ్మ. మల్లిదొర కంటతడిపెట్టాడు. "దొర నాకు పని అప్పచెప్పాడు" అన్నాడు మొరెల్గిందొర గంభీరంగా. "దేవుడు! ఆయనకేం" అన్నాడు పొట్టిదొర భక్తితో. అప్పుడే పనిని వంతులు వేసుకున్నారు - గూడెంలో ఉన్న పక్లైనిమిది యువకులలోనూ సగంమంది మిగతా పనులన్నీ చెయ్యడానికీ, తక్కిన సగంమందీ రోజా మరమ్మత్తు చెయ్యడానికీ.

కావలసిన సామగ్రిఅంతా పట్టుకొని మన్నాడే బయలుదేరారు. బొర్రిస్నదొర సమాధి దగ్గిర మొక్కారు. అతనికి పూజచేశారు. "దొరకు కేకేద" అన్నాడు పొట్టి దొర. "రాత్రి ఏ చిందుకో తినేసుంటుంది" అన్నాడు బాలుదొర. "ఆహా! ఏమిస్వామిభక్తి" అన్నాడు మల్లిదొర తన్మయత్వంతో. కుక్కకి ఒక రాయి పాతేరు సమాధిదగ్గిర. రోజా అంతా బాగుచెయ్యడానికి రెండునెల్లు పట్టింది. అంతమంది కలిస్తే రెండు నెల్లు పట్టింది. బొర్రిస్నదొర ఒక్కడే రెండువంతుల రోజా నాలుగునెలల్లో చేశాడు! ఎలాగచేశాడో అని యువకులు ఆశ్చర్యపోయి తన్మయులయారు.

జమాబందీకోసం డిప్టీకలెక్టరుగారు లాగరాయికి వస్తారని తెలిసింది. ఆయన క్రితం సంవత్సరం అనుభవంమీద ఏబండీ అక్కర్లేదు, రోజామీద నడిచేవస్తానని ముఠాదారుకిచెప్పాడు. ముఠాదారూ, మునసబూకూడా "రోజాగచ్చు రోడ్డులాగుం"దని ఒకేసారిఅన్నారు. డిప్టీకలెక్టరుగారు చిరునవ్వునవ్వారు; అంతకంటే సమాధానం చెప్పలేదు. తీరా ఆయన బయలుదేరి లాగరాయికివస్తూ రోజాస్థితిచూసి నిర్విణ్ణుడైపోయాడు. డిప్టీకలెక్టరుగారిబండీ బొర్రిన్న దేవుడు ఉన్నచోట ఆగింది. ఆయన బండి దిగి ఆశ్చర్యపడ్డాడు. "లాగరాయి దొరలకి చాలా ఉపకారంచేశాడు దొర" అన్నాడు నెమ్మదిగా. "ఆయన దేవుడయ్యాడండీ" అన్నాడు మునసబు భక్తితో. డిప్టీకలెక్టరుగారు చిరునవ్వుతో బండీ ఎక్కారు.

# పల్లెకారీ!

నోరి నరసింహశాస్త్రి

నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

కటిక చీకటి కట్టె నల్లెడ
కన్నుగానక తెన్ను తప్పితి
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

ఓ,
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియవా?

గట్టులెన్నో మట్టి మసలితి
పుట్టలెన్నో మెట్టి జడిసితి
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

ఓ,
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియవా!

అడుగు తడబా టడగ లేదోయ్
గుండె దడ విడి కూడుకొనదోయ్
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

ఓ,
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియవా?

కారు మొయిళులు కప్పెమింటను
పిడుగు లురుముల జడియు సాగను
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

ఓ,
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియవా?

పెద్దపల్లెల పెద్దపల్లే!
నిన్ను చేరితి రన్న ఎట్టటా!
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియరా!

ఓ,
నావనడిపే పల్లెకారీ
రేవు దాటియవా?

సుళువుగ
రేవు దాటియవా?

# రాజభిక్షువు

## చిర్రావూరు కామేశ్వరరావు

స్వర్ణ సౌధాగ్రమున సాంద్ర చంద్రికావి
భవము తరళించె గన్నులపండువగుచు;
కపిలవస్తునగరలక్ష్మి విపుల సుఖని
కేతనము, పూర్ణకౌముదీస్నాత యయ్యె.
రాజసౌధ సమీప మార్గమున, గౌత
మముని, శాక్యమణి, విరాజమానుడయ్యె.
గాదిలికుమారు మంగళాగమనవార్త
చెవుల సోకిన తోడనే చిత్త మదర,
సాధులోక విభుండు, శుద్ధోధనుండు,
బాష్ప సంసిక్త గాత్రుడై, పరుగు పరుగు
న నరుదెంచి, రాశ్లేషించి,
యనియె నిటులు:
"కొడుక, మమ్మొడబాసి, నీ వడవులందు
నెట్లు లుంటివో! ఏడేండ్లు నేడుయుగము
లయ్యె మాకు!—సువర్ణ సింహాసనమున
నధివసింప నెలసిన నీ కిష్ట మగునె
తిరిప మెత్తుట వాడల దిరిగి తిరిగి?-
మకుటమును దాల్పనలసిన మస్తకమున
పింగళము జటాజూటము నెలయ దగునె?
రాజదండయోగ్యమగు కరంబునందు
దీనునివలె భిక్షాపాత్ర నూనదగునె?
కాంచనాంబర భూషణోత్కరము మాని,
ధర్మమే నీకు కౌపీనధారణంబు?
శాక్యవంశాబ్ధి సంపూర్ణచంద్ర, ఇంద్ర-
విభవమును వీడి తలమెత్తి బిచ్చ మెత్తె
దేల? తలవంపు మాకు ఘటిల్లునటులు".

గౌతముడు పితృచరణ పంకజముల కెరగి,
కనుల ప్రమోద మొలుక,
వాగ్విభవ మొలయ,
బలికె, "జనకా, విమోహ సంభవము
జగము;
రాజ్యమేమి? పాలనమేమి? రాజెవండు?
భస్మముకై యింత తాపత్రయంబు
తగునె ప్రాణికోటికి? శాశ్వతమె యిహసుఖ
దర్శనములు? భంగుర వినోదములు?
—సుఖద-
ముగాని ముగిసిపడెడు జడబుద్ధి దొలగి,
యక్షయమగు భిక్షాపాత్ర నందికొనుము!
జరయు మృతియులేని నిరోగసరణి గనుము!
సుస్థిరానంద నిర్వాణ శుభముకంటె
ఘనతరమె స్వర్ణసామ్రాజ్యగరిమ, జనక!-
కనులు తెరచి చూడుము, శోకకలితమైన
యీ వసుంధరాతలము, నీహృదయ తిమిర
ము నుపసంహరించుకొనుము; భువనమందు
నిక్షణమున జితాశల మెన్నిచోట్ల
మండుచున్నదో, కన్నీటి మడుగు లెన్ని
నిండిపోయి స్రవించె నీనిముషమందు?
ఎన్ని దుఃఖగాథలు రచియింప బడియె
నిపుడు; కాల సక్రాంతిలో నీ దినమున
నెన్ని ప్రాణులు దేలెనో, యెవ్వ డెఱుగు?-
తీవ్ర దుఃఖార్తమైన మేదిని, సుఖాల
యమని మోసపోకుము; జనకా, మకుటము

కంటక పరిశోభితము, దుఃఖ ప్రదంబు,
రాజదండ మెంతయును భారంబు సుమ్ము,
ఏటి రాజరికము, వల్లకాటి సుఖము !"—
"ఆత్మరాజ్య సుఖముగంటి నహహా, ధన్య
తముడనై తిని! నాదు జన్మము తరించె !-
ఇంక నాలస్యమేల, మహానుభావ,
పద, మహాయాత్ర నెఱపగావలయు
మనము !-
పథ మనంత మిట మనల వ్యవధిలేదు;
తెలసికొంటి భిక్షాపాత్ర దేనికొఱకొ,
అక్షయానంద దాయకి మైనదాని
బట్టుకొను రాజయోగము వడయనిమ్ము !-"
అనుచు శుద్ధోదనుండు, మోహాంధతమస
మెడసి, వైరాగ్య సంచారహృదయు
డయ్యె,
లలిత సుకుమారుడైన రాహులుడును,
నవ సి-
తాంబుజమువోలె సన్మనోహరుడు నగుచు,
మాతృదేవీ సమేతుడై, పిత్రుసన్ని
ధానమున కేగుదెంచె;—నందనుని వైపు
కరుణ రసతరంగిత కటాక్షముల బరపి,
బుద్ధదేవుడు, జగదేక పుణ్యమూర్తి,
యతని కోమల మస్తకమందు నిడియె
స్వర్ణకలిత కిరీటము !-- పట్టభద్రు
డైన యాకుమారుని మీద నమరవరులు
గురిసి రానంద భరితులై విరులవాన -
పరమసాధ్వి యశోధరా పద్మనయన,
అశ్రుకలుషితవదనయై, ప్రాణవిభుని
చరణముల వ్రాలి, పలుకాడ జాలదయ్యె.
"వనిత, నిర్వాణ సామ్రాజ్యపాలనంబు
మనది, వసుమతీభరణ మితనిది;—లెమ్మి,
నడువవలసిన మార్గ మనంత, మతుల
సుఖనివాసము గాన ఈ శోకముడిగి
అక్షయమగు భిక్షాపాత్ర నందుకొనుము -
దీనిలో భేదభావము లీనమయ్యె,
కాలమానము దీనికి గలుగబోదు,
అఖిలశోక నిర్మూలనమైన దీని
తత్త్వమెఱిగి త్రిలోకైక ధన్యవగుము!-"
అనుచు నామెను నూరార్చి, కనికరమున
లేవదీసె సిద్ధార్థు డాశ్లేషపూర్వకముగ-
శాక్యవంశ సుధార్ణవమున బూర్ణ-
చంద్రమూర్తి రాహులుడు
ప్రజ్వలితుడగుచు,
భాగ్య భోగ్య విలాస సంభరితుడయ్యె.
నడచిపోయిరి ముప్వు రనంతధామ
మున కభిముఖముగా; గొంతదనుక నడచి,
చిఱుతప్రాయంపు కొమరుని చెలువులెంచు
కొనుచు, సాధ్వి యశోధర వెనుకబడియె,
కొంతదూరాన వృద్ధభూకాంతమౌళి
స్థూలకాయము విడచె, బుద్ధుడు వెనుకకు
జూడలేదు, మనశ్శాంతి వీడలేదు,
తుదిమొదలులేని పథమున ముదముతోడ
నడచిపోయెను, విధివిధానమువిధమున !-
విమల ఫల్గునీ వీచికాసముదయముల,
అతుల సుజ్ఞానకలిత వజ్రాసనమున,
బోధిపాదపచ్ఛాయల, పుణ్యభార-
తావనీ రేణువులయందు నఖిల దిశల
భవ్యనిర్వాణ సంగీత వైభవంబు
కరము నిశ్శబ్దకరముగా బరిఢవిల్లె;-
రాజభిక్షువు జగదంతరాత్మ యయ్యె.

## ప్రతిభ

శిల్ప సంబంధమైన వ్యాసములలో భారతీయ చిత్రకళా చరిత్రమూ, అందులోని రహస్యములూ బోధింపబడ్డవి. కళాలక్ష్మి ప్రతిగృహములోనూ ప్రతిగృహోపకరణములోనూ ఎట్లు తొలకాడుతూ ఉండేదో విస్మరించిన నేటి భారతీయులు కళలంటే ఏమిటో ఎన్నడూ ఎరగనివారివలె పాశ్చాత్య పద్ధతులనే అనుకరించడము శోచనీయము. భారతీయ చిత్రకళా మర్మము తెలుసుకోవలెనంటే మన దేవాలయములూ, గొప్ప విహారములూ స్తూపములూ కళాదృష్టితో చూడవలెను. సుందరవస్తువులను చూచి ఆనందించగలిగి ఉండుటయు కూడా ఒక కళే. అనుభవమువల్ల దానిని పెంపొందించుకోవలెను. కళ ప్రపంచముయొక్క యథార్థ రూపమును వ్యక్తీకరిస్తుంది. దానిని దర్శించి ఆనందించేవాడే కళాభిజ్ఞుడు. "ఎవ్వరు స్వకీయ జీవనమునందలి సత్యమును సాక్షాత్కరించుకొనగలరో, ఎవరి చిత్తము భగవదాయత్తమై, పరానురక్తిప్రవాహమున నిమగ్నమై యుండునో, ఎవరిభావము దేహమనఃప్రాణముల నతిక్రమించి ప్రేమానందమున పారవశ్యము నొందునో వారే కళావిదులు, వారే రసస్రష్టలు, వారే కవులు, శిల్పులు, గాయకులు, చిత్రలేఖకులు, విగ్రహ నిర్మాతలు కాగలరు."

రూపకల్పన, ఆత్మవితరణము, సాధన- ఈమూడువ్యాసములూ ధర్మము అనేశీర్షికలోనివి. ఉపాసనలో ఉండే తారతమ్యములూ, భేదములూ, సాధకునకు దారుశిలాలోహవిగ్రహాలలో వస్తుజ్ఞానము నశించి దేవతాబుద్ధి ఎట్లు కలుగుతుందో మొదటివ్యాసములోనూ, ఆత్మవికాసమునకు—తన అల్పత్వమును వదలి విశ్వాత్మను పొందుటకు—ఆత్మవితరణము—అనగా తపస్సు—ఎట్లు మానవునకావశ్యకమో రెండోవ్యాసములోనూ, సాధన ఉత్తమస్థితి నొందుటకెట్లవసరమో, సాధనలో ఉన్న వివిధావస్థలేవో సాధకుడెట్లు 'శ్రీరామచరణరజముకొరకు నిరీక్షించుచుండిన అహల్యవలె' పరమేశ్వరుని రాకకై కనిపెట్టుకొని ఉండునో మూడవవ్యాసములోనూ గ్రంథకర్త వర్ణించినాడు.

ఈ గ్రంథములోఉన్న వ్యాసములన్నీ అత్యుత్తమ శ్రేణికి చెందినవి. గ్రంథకర్త విషయపరిజ్ఞానములో పరిణతుడుగానూ, విషయవ్యక్తీకరణములో సిద్ధహస్తుడుగానూ కనబడుతున్నాడు.

కృష్ణాపత్రికాపాఠకులకు ఈ శైలి సుపరిచితమైనది. ఈ వ్యాసములు సర్వవిధముల పత్రికాధిపతుల శైలినీ విజ్ఞానసంపదనూ తలపిస్తున్నవి. శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులు గారికి తెరమరుగున ఉండడమే ఇష్టము అని శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పినమాట మాకు ఇప్పుడు తలపునకు వస్తున్నది.

డే. కృ.



## వినోదనాటికలు

(క్రౌనుసైజు ౧౦౫ పుటలు - వెల 8 అణాలు)

కర్త : విశ్వనాథ కవిరాజు

ప్రకాశకులు : మల్లాది అవధాని, నాట్యభారతి, విజయనగరం.

ఈ చిన్న సంపుటములో 'సారగదిలో', 'కిర్రుగానుగ', 'దొంగాటకం', 'ప్రహ్లాద', 'అపశ్రుతి' అనే అయిదు ఏకాంక నాటికలు ఉన్నవి. విశ్వనాథ కవిరాజుగారు అప్పుడప్పుడు పత్రికలలో ప్రకటించిన నాటికలు, ఇట్టి చిన్నచిన్న సంపుటములుగా ప్రకటించదలచుకొన్న శ్రీ మల్లాది అవధానిగారి ఉద్యమము పాఠకలోకానికి మహోపకారకము.

విశ్వనాథ కవిరాజుగారు సంస్కృతాంధ్రములలో గొప్ప పండితులు. వారికి నాటకకళ అభిమాన విషయము. సంస్కృతాంధ్రములలో ఉన్న నాటకములే కాక ఇంగ్లీషు నాటకములూ, ఆంగ్లభాష ద్వారా లభ్యమయ్యే ఇతర ప్రాచ్యపాశ్చాత్యభాషలలోని నాటకములూ వందలకొలదిగానో, వేలకొలది గానో వారు చదివిఉన్నారు. సంస్కృతనాటకాలు కొన్ని అనువదించారు. వారు రచించిన తెలుగు నాటకాలు రంగస్థలముమీద మిక్కిలి రక్తికట్టినవి. నాటకకళాప్రియులు కావడమువల్ల వారురచించిన నాటకములన్నీ ప్రదర్శన యోగ్యముగా ఉన్నవి. సన్నివేశములు కల్పించడములోనూ సంభాషణలు నడిపించడములోనూ, హాస్యరసము ఒలికించడములోనూ వారిని ఎవరూ మించలేరని నిట్టిగా చెప్ప వచ్చును. హాస్యానికి పూనుకొన్నవారు సామాన్యముగా అసభ్యరచనలు చేస్తారు. మోటుగా వ్రాస్తారు. కాని కవిరాజుగారి రచనలలో ఆదోషాలు వెతకినా గోచరించవు.

ఈ సంపుటముచివర చేర్చిన పత్రికల అభిప్రాయాలూ పండితుల అభిప్రాయాలు ఈ నాటికల విశిష్ట తను ఎంతో ఉగ్గడిస్తూ ఉన్నవి. ఇవి సర్వజనాదరణీయములని ఋజువుచేస్తున్నవి.

'సారెగదిలో' అనే మొదటి నాటికలో అప్పల నరసింహం ప్రధానపాత్ర - నాయకుడు. కాపురం చేసుకోకుండా భార్యని చాలాకాలం పుట్టింట అట్టేపెట్టి ఆమె ఎన్నాళ్ళు శీలం కాపాడుకో గలదో పరీక్షించాలని పట్టుదల వహించాడు. చివరకు సారెరోజున దానిగూర్చి అనుమానాలు పెట్టుకొన్నాడు. పురాణాలలోనూ కావ్యాలలోనూ వర్ణింపబడ్డ పతివ్రతలవలె తన భార్య ప్రవర్తించడము లేదని, మాటి మాటికి కావ్యాలూ శాస్త్రాలూ స్మరిస్తూ, బాధపడి ఆమెను బాధపెట్టుతాడు. పెళ్ళికూతురి సోదరునికి ఆడవేషము వేసి, సీత దమయంతి మొదలయిన పతివ్రతలకంటె ఎక్కువ పతివ్రతవలె నటించేలాగున చేసి, రమణ అనేవాడు నాయకుడి బావమరది, నాయకుడి మనస్సు మరలిస్తాడు. నాయిక - కృష్ణవేణి - అప్పుడు తిరిగీ సారెగదిలో ప్రవేశించి నాయకుడి మెప్పుపొందుతుంది.

రెండో నాటిక 'కిరుగ్గానుగ.' మోహనరావనే విద్యార్థి పల్లెటూరివారిఅల్లుడు. మోహనరావుకు విద్యా ర్థులు తమలో తమకు అనుకొనేమాటలు - slang - ఉపయోగించడము బాగా అలవాటయిపోయినది. అత్తవారింటికి తొలిసారివచ్చినప్పుడు "కిరుగ్గ, మతాబాకాల్చేస్తాను, కెంకలుకొట్టేస్తాను, కాజా తినిపిస్తాను, కమ్మకట్టి మాడ్చేస్తాను, ఆఫోటాలాంటి జఫాటా ఒకటిచ్చి టోకరా కొట్టించేస్తాను, గుమ్గలాతాచేస్తాను" అని అతిప్రౌఢమైన భాష ప్రయోగిస్తూ కాలుకాలిన పిల్లిలాగ చిందులు తొక్కుతూఉంటే అత్తమామ లది చూచి అల్లుడికి పిచ్చియెత్తినదనుకుంటారు. వారిలాగున అనుకొన్న కొద్దీ మోహనరావు మరీ వాచాలతవహిస్తాడు. ఇంతలో చికిత్స చేయించడానికి వైద్యుణి పిలుచుకువస్తారు. నోటిలో గుడ్డకుక్కి, మంచానికి కాళ్లూ చేతులూకట్టి జుట్టుతీయించివేయవలెనని-జుట్టుంటే స్నానాలు చేయించడానికి వీలుపడదని - ప్రయత్నిస్తూఉండగా మోహనరావుస్నేహితుడు శంకరశాస్త్రి వచ్చి సంగతంతా గ్రహించి, మోహనరావును విడిపించి ఆపాడుభాష విడిచిపెట్టుమని బోధిస్తాడు. మోహన రావుకు తన పిశాచభాషా ప్రభావము అప్పుడు బోధపడ్డది.

దొంగాటకములో ప్రకాశరావనే యువకుడు "ఆంధ్రశ్లాకుహోమ్సు" అనే పేరుతో గొప్ప డిటెక్టివువలె తిరుగుతూ భార్యయెదుట తన ధైర్యస్థైర్యాలు తానే పొగడుకొంటూ ఉంటే ఆమె వాని ధైర్యము పరీక్షించాలని ఒక గొప్పనాటకము ఆడుతుంది. తన అన్నను దొంగగా ప్రవేశపెట్టి వాడు చెప్పినట్లల్లా భర్త చేయడమూ, చివరకు గుంజీలు తీయడమూకూడా చూస్తుంది.

'ప్రహ్లాద'లో హిరణ్యకశిపుడు గ్రాంధిక హిట్లర్. ఉయ్యాలలో ఉన్న పసిపాపకూడా గ్రాంథికము లోనే ఏడవాలంటాడు. తండ్రిమాటలకూ బోధనలకూ పిల్లవాడు జడుసుకొని తండ్రిని బూచి అను కొంటాడు.

'అపశ్రుతి'లో రంగారావనే నటకుడు ఎన్నోదినాలు టూరుచేసి 'కొండో గోపురమో'అనుకొని ఇంటికి వచ్చేసరికి అకారణంగా భార్య అలిగి పడుకొంటుంది. అలక తీరేసరికి ఆ చిన్నసంసారానికి అతిథి వస్తాడు - బావమరిది.

సాధారణజీవితములో ఉండే ఏదో ఒకచిన్న సమస్యగాని సన్నివేశముగాని కథావస్తువుగా తీసుకొని చక్కని నాటకము రచించేశక్తి విశ్వనాథ కవిరాజుగారికే చెల్లినది. వీరి రచనలు బాగా ప్రచారము లోనికి రావలెననీ, వీరింకా చాలా చాలా నాటకాలు ఆంధ్రలోకానికి అర్పించవలెననీ మా అభి మతము.

రా. సు.

Δ

## రాష్ట్రగానము

ఖండకావ్యము: 32 పుటలు: వెల నాలుగుఅణాలు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

తెలుగుపండితుడు, హైస్కూలు, బాపట్ల

సీతారామమూర్తిచౌదరిగారు తెలుగుదేశానికి చిరపరిచితులు. వీరు మంచి జాతీయకవులు. ఏపద్యమైనా ముద్దుగా నడిపించగలరు. వీరికృతలలో తేటతెలుగు తీయందనము చవి చూడగలము. అక్కడక్కడ చక్కని జాతీయములు వీరికవితకు మెరుగుపెడుతూ ఉంటవి. పూర్వకవి సంప్రదాయాలు మెండు. కవిత్వం ప్రాచీన ఫక్కీ.

ఆంధ్రరాష్ట్రాందోళనలో ప్రజలంతా ఉక్కిరిబిక్కిరి అయ్యే రోజుల్లో కాలానుగుణ్యంగా తమమృదు మధుర శైలిలో ప్రాచీనాంధ్రుల ఔన్నత్యాన్ని గురించి తెలియజేసే ఈ చక్కని పద్యాలు పుస్తక రూపకంగా పాఠక లోకానికి అందించి ఈయన ఆంధ్రులకు మహోపకారం చేశారు.

ఈ గ్రంథము చల్లపల్లీశ్వరునకు అంకితము.

"చెలువమ్మునెగజిమ్మ జిలుగుతెల్గులతోడ పెన్నగట్టున కృతుల్ పెరుగునాడు........."

"పాటలీపుత్రమ్ముకోటకొమ్మలమీద తెలుగుజెండాలు నర్తించునాడు........."

"మంటికుండయు నుల్కమంచం బెరుంగక చందవోల్పురము పెంపొందునాడు........."

మొదలైన పద్యాలు రాయప్రోలు సుబ్బారావుగారి

"అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు........."

"కృష్ణాతరంగ పంక్తిం ద్రొక్కి తుళ్లింత నాంధ్రనాకలు నాట్యమాడునాడు........."

అనే పద్యాల్ని జ్ఞప్తికి తెస్తున్నవి.

ఒకప్పుడు సుబ్బారావుగారిలాగే ఇప్పుడు చౌదరిగారిలో ఆంధ్రాభిమానం అణువుఅణువులో జీర్ణించి పద్యరూపకంగా పైకి పొంగిపొర్లుతూ ఉన్నది. ఈ కావ్యంలో రాయప్రోలు విశ్వనాథవార్ల కవితా ప్రభావము (influence) బాగా కనిపించుతూవుంది.

"పాలిపోవలేదు తెల్గుల పరాక్రమరేఖ మన 'టంగుటూరి'లో మల్లడించె
సడలలేదాంధ్ర విజ్ఞాన తేజఃపుంజ మది 'రామలింగార్య'నాశ్రయించె
చెదరిపోలేదాంధ్ర శేముషీ సంపత్తి 'పట్టాభి' సచివు కేల్ పట్టుకొనియె
బీరువోలేదాంధ్ర వీరదాతృత్వంబు 'నాగేశ్వరు'నిలో బెనంగియుండె
తరిగిపోలేదు తెల్గుకైతల పసందు కులుకుచున్నది 'చెళ్ళపిళ్ళ' కలమునందు
నిస్పృహాహేతు విందుకేనియును లేదు సోదరా లెమ్ము నీహక్కు కాదుకొమ్ము"

ఈ పద్యం అభిమానం గల ప్రతి ఆంధ్రునికి మేను పులకరింప జేస్తుంది.

"............లోకులు సంతసింతు రబ్బా! యని మెచ్చుకొందురి పరభాషలు నేర్చిన తెల్గుసోదరుల్" ఈపద్యంలోని "అబ్బా" అను మాట పూర్వ గ్రంథాల్లో గాని- ఇప్పుడు వాడుకలోగాని ఆశ్చర్య వాచకంగానో, లేక ప్రశంసా వాచకంగానో ఎవ్వరూ ఉపయోగించినట్లు కనిపించదు. విషాదవాచకంగా మాత్రం వ్యవహరిస్తున్నాము.

"పెంటల్ చిమ్మెదు కుంటిసంకల కవుల్ ప్రింటింగు హాంటింగులే"
"పెంటల్" అనేమాట శిష్టులు వాడదగినంత సరసమైన మాట కాదు.

ఇంగ్లీషు చదువుకోడంవల్ల దేశానికి నష్టం కలిగిందనీ, ఇంగ్లీషు నేర్చుకొన్నవారు తెలుగులో "అందము చందము లేని పాత్రముల్ పుసపుస గసి దుర్వ్యాకృతము వ్రాసిరి కిమ్మని తెల్గిడాసకుల్" అనీ చౌదరిగారు అంటున్నారు. పరభాషలవిషయం తెలియకుండా కవిత్వం చెప్పితే ఇంకా పిల్లమనుచరిత్రలూ, పిల్లవసుచరిత్రలూ చాలా బయలుదేర ఉండేవి. ఇప్పటికైనా తెలుగువారు కళ్లుతెరచి తక్కిన ప్రపంచాన్ని చూడబట్టే, నవ్యసాహిత్యం నానాటికీ నానాముఖాల దినదిన ప్రవర్ధమానమవుతూవుంది. లేకపోతే "స్వభాష తెలుసుకొని తక్కిన వేవీ గ్రహించకుండా వుంటే గ్రంథకర్త జటాగుర్రం లాగ అవుతాడు" అన్న ఒకమహాకవిమాటలు సత్యమౌతవి. "అయ్యారుగూడకట్టు మనకిక్కరయే గుజరాతిటోపితో నెయ్యము లెస్సగావలయు నిత్యము బెంగలిబాబులాల్చి లేదయ్యెనయేని చక్కదనమన్నదిసున్న తెలుంగువానికీ దయ్యపువేసమేల మన తాతలతండ్రులకట్టు గిట్టదే?" గూడకట్టు, టోపి, లాల్చి వేసుకోడం దయ్యపువేషమట! దయ్యపువేషమైతే అందరూ ఎందుకు వేసుకొంటున్నారో కవిగారు కొంచెమైనా ఆలోచించలేదే! చౌదరిగారి దృష్టిలో అలా కావచ్చుగాని అందరిదృష్టిలో కాదే! తమ ఒక్కరి అభిప్రాయమే సర్వజనాంగీకారం అవుతుందా? 'ఈ వేషం మంచిది, ఆవేషం చెడ్డది' అని ఎవరునిర్ణయించుతారు? వేషభాషలు బహుజనాభిప్రాయోచితంగా కాలాని కొకరకంగా మారుతాయి. ఆ ప్రవాహాన్ని ఎవరుఅడ్డినా తలకిందే! అయితే మన పూర్వులు అనాదినుంచీ ఒకటేవేషంతో ఉన్నారా? ప్రాచీనులైన ఆనార్యులు గోచిపెట్టుకొని తిరిగారని ఇప్పుడుకూడా అలాచెయ్యమంటే చేస్తారా! అలాఅనటంకూడా సమంజసమా? ఆంధ్రులు ఈవేషం ధరించాలనని

ఎవ్వరూ ఎక్కడా నిర్ణయించలేదే! పోనీ చౌదరిగారైనా ఆపనిచేస్తే బాగుంటుందేమో! ఆంధ్రు లందరూ దీనినే అవలంబించుతారేమో!

ఇప్పటి తెలుగువారు పుస్తీలు, మీసాలు గొరిగించుతున్నారనీ, "మీసములేని మూతి" సౌందర్యహీన మనీ కవిగారు చింతిస్తున్నారు.

అసలు "రాష్ట్రగానము"లో ఈమీసాల ప్రసంగమే అప్రస్తుతము. కవిగారు వ్రాసినందుకుమాత్రం విమర్శించక తప్పదు. పుస్తీలు, మీసాలు తీసివేసినంతమాత్రాన వచ్చేప్రమాదం ఏమీ లేదే! ఇవి పెంచుకుంటేనే ఆంధ్రరాష్ట్రం వస్తుందా—లేకపోతే రాదా? "లోకో భిన్నరుచిః" అన్నారు పెద్దలు. ఎవరి యిష్టము వారిదీ. మీసాలు ఉంచుకోటమే అందమని ఎవరునిర్ణయించారు? ఒకముఖానికి అందంగావుంటవి. ఇంకోముఖానికి అందంగావుండవు. "హరిసర్వోత్తమరావు, కొల్లిపర సూరాభి ఖ్యుడున్, తెల్లు శౌర్యరమానాగులు కోటిరెడ్డియును, మా రంగయ్యనాయుండు నెవ్వరికో పుట్టినబుద్ధి మెచ్చి కళికావాసంబులౌ మీసముల్ గొరుగంబూనకయుండ్రుగాక యని మ్రొక్కుల్ వేయిదేవుళ్లకున్" హరిసర్వోత్తమరావుగారు మొదలైనవారు మీసాలుగొరిగించకుండా ఉండాలనని వేయిదేవుళ్ళకు మొక్కడంకూడా రాష్ట్రగానమేనా? వీరు మీసాలు గొరిగించినంతమాత్రాన్నే వచ్చే ఆంధ్రరాష్ట్రం రాకుండాపోతుందా? మీసాలు కళికావాసములని ఎవరన్నారు? మీసంలోనే పౌరుషం ఉందను కోటం కొన్నిశతాబ్దాలక్రిందటివిషయం.

> "ఎల్లరు నాంధ్రదేశమున కియ్యెడ కేంద్రమటంచు సహ్యసం
> పల్లవకోలవాలమన భాసిలు సహ్యసుతాతటంబునన్
> జెల్లగ నిల్పినట్టి పరిషత్తు విశాఖను నెట్ట మిమ్ము సు
> మ్మల్లరిపాలుచేసిన మహామహు లెవ్వరొ వీరెరుంగుడీ"

సహ్యసుతాతటమునందు ఏపరిషత్తు ఉండేది? 'సహ్యసుత' అంటే ఏమిటి? ఆంధ్రదేశానికి కేంద్రము అనటాన్ని బట్టి, ఇప్పటి పరిషత్తు విశాఖను నెట్టి అనడంవల్లా సహ్యసుతాతటము బెజవాడే ఉండాలి. అందుచేత 'సహ్యసుత' అంటే కవిగారి అర్థంలో కృష్ణానదై ఉంటుంది. సహ్యాద్రిలో పుట్టింది కావేరి గాని కృష్ణ కాదే! రామరాజ భూషణుడు కూడా వసుచరిత్రలో,

"వెస విభీషణరాజ్య విముఖుడై సహ్యభూవలయంబు జేకొని నిలువ డేని"

అని కావేరీనది అనే అర్థంలో ప్రయోగించాడు. ఈ నది ఆంధ్రదేశంలోనే ప్రవహించలేదే! సామాన్యంగా ఎవ్వరూ ప్రాచీనుల్లోగాని, ఆధునికుల్లోగాని కృష్ణానదికి 'సహ్యసుత' అని ప్రయో గించినట్లు కనుపించదు.

పుస్తకంలో వ్యక్తిగతస్తోత్రాలు ఎక్కువగానేఉన్నవి. అయినా చాలావరకు చరిత్రాత్మక విషయాలే!

"ఇంటన్ దగ్గదు వగ్గుతాతలకడన్....................."

"ఇద్దరు తెల్గువాండ్రు....................."

"పసగల జవ్వనంబు....................."

"అయ్యరుగూడకట్టు....................."

"మీసములేనిమూతి....................."

మొదలైన కొన్ని అనవసరపు పద్యాలు ఆణిముత్యాలహారములో గాజుపూసలవలె గ్రంథానికి తీరని కళంకం ఆపాదిస్తున్నవి. ఇవి తీసివేస్తే మిగతా పుస్తకం ముద్దులమూరిపించు పద్యాలతో కళకళ లాడుతూ ఉండేది. ఏది ఏలావున్న ఈ "రాష్ట్రగానము" ఆంధ్రరాష్ట్రోద్యమానికి తోడ్పడుతుందని మాత్రం ఒప్పుకోక తప్పదు.

చౌదరిగారు ఇంకా సమయోచితంగా "మందార మకరంద మాధుర్యధుర్య" మౌ కావ్యాలు వ్రాసి తెలుగుచదువరులకు అందలి తీయతేనియలను చవిచూపించగలరని విశ్వసిస్తున్నాము.

వ. రం.



## తోరణము

ఖండకావ్యసంపుటి: 40 పుటలు : వెల లేదు

కవి : మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

ఆంధ్రకుటీరము, పల్లిపాలెం, ఇంజరంపోష్టు, కాకినాడ తాలూకా.

"తోరణము" ఆంధ్రకుటీరములో తొలిపుష్పమై ప్రకాశించె. విశ్వనాథ సత్యనారాయణగారి 'తోరణపీఠిక' కవికి ఉత్సాహజనకమై ఉన్నది.

దీనిలోని పద్యాలు ఎక్కడా కుంటుపడకుండా సాఫీగా నడిచినవి. ధార చాలామంచిది. మచ్చుకు,

> "ఎన్నివిధాల కష్టపడి యేమియొసర్చిన నెన్ని నాళ్ళపం
> కన్ననితోడ నీవు గురునింపవు ఓడ్డలతండ్రికైనవో
> యన్న, యొక్కల్లు సంస్కృతమహార్ణవ మీఁదగఁజాలినో యటం
> చెన్నడు ముఖవహ్ని మది నేపగలంగుడు నుండు పుత్త్రికా!"

టీకాకారులు చెప్పినట్లుగా, "పిత్రాశిక్ష"లో రామాయణపారాయణ ఫలితము, అన్నవరపు సత్యనారాయణమూర్తియందలి స్వామిభక్తి. "ముదిమగ్గు"లో పరాచికము, "పరిత్యక్త"లో ఒక విశిష్టానుభవము, "సందేశము"లో దేశభక్తి, "ప్రబోధ"మందలి "గాజుకన్నైస్తన నౌకయుశ్రీక బ్రమరాల్చు" అనుటలో వీర కవితాశక్తి గోచరించుచున్నవి.

ఈ కవి పల్లిపాలెంలో "ఆంధ్రకుటీరము" నెలకొల్పి ఆప్రాంతీయముల భాషాప్రచారము చేస్తూ ఉండడము ఎంతో ప్రశంసనీయము. వీరు ఈ విధంగానే ఉత్సాహంతో ఎల్లప్పుడూ భాషా ప్రచారము చేస్తూ చరితార్థులు కావలెనని మాకోరిక.

> "ప్రాచీన రాజకీయాచార విజ్ఞాల చిత్తవృత్తుల భంగి సేకరించి
> భరతమాతకు నిజప్రాణమ్ములిచ్చిన యాంధ్రవీరుల చరిత్రంబు మెరిగి
> చంద్రగుప్తాశోక చక్రవర్తుల రాష్ట్ర పరిపాలన ప్రౌఢ తెరగు తెలిసి
> గండపెండెరము డాకాల దొడ్గిననాటి రాయల భాషాదరమ్ము దలచి
> మనసు మరలించి ధృతిమించి మంచిత్రోవ బోవుడీ మురండు ధీరాంధ్ర పుత్రులార!
> మరచిపోకుడు ప్రాచీన మహిత దేశభాగ్య సౌభాగ్యయోగ్య సంపత్సమృద్ధి"

ఈ పద్యము వీరి గాఢమైన ఆంధ్రాభిమానాన్ని చాటుతూవుంది.

ఈ కావ్యంలోని ప్రతిపద్యమూ సజీవంగా ఉన్నది. వీరి కవిత్వం ఆడంబరాలలో అడగిపోక నగ్నంగా, సహజంగా ఉంటుంది.

> “అతులగతుల సతతమును కెలగుతిల
> పడెడు బడుగుల యిడుమల విడల నడప
> దొడరి పావమిన మొదయడ వడుగవలెనె ?
> ప్రభువ, సరథసమభిమత శుభములిడవె !”

ఈ పై పద్యంలో కవి కొంచెము సాము (feats) చేసినట్లుగా కనిపిస్తుంది. పద్యాల్లో ఇకమీదట ఈ సాముగరిడీలు మానివేస్తే బాగుంటుంది. “సుసుఖము, సుదారణము” ఇత్యాది ప్రయోగాలు అంత సమంజసముగా కన్పట్టవు. ముమ్ముందు ఇతడు గొప్ప కవి అయ్యేసూచనలు వీరి పద్యాల్లో చాలా కనిపిస్తున్నవి.

ఈ “ఆంధ్రికుటీరము” ఇంకా ముద్దులొలికే పూలు పూచి కమ్మతావులను నలుదెసలా వ్యాపింపజేయ గలదని ఆశిస్తున్నాము.

న. రం.

## స్వ ప్నా ను సూ య

ఆకొండి రామమూర్తి
ఆంధ్రికుటీరము, పల్లిపాలెము

ఇది గద్య పద్యాత్మకంగా ప్రాచీన ధోరణిలో రచించిన అయిదాశ్వాసాల కావ్యము.

అనేక నూతన భావాలూ, ఆశయాలూ, పంథాలూ అడుగడుగునా విలసిల్లుతూ మన సారస్వత ములో ఇదొక నవ్యయుగముగా మిరుమిట్లు కొలుపుతూ ఉన్న నేటి కాలములో ఇటువంటి ఎత్తుకు ఎత్తు ప్రాచీన ధోరణి ఉన్న కావ్యాలు చాలా అరుదు.

సహజమై, సరళమైన శైలిలో కవి ఒక స్వప్నానుభూతిని ఇంత గ్రంథముచేసి ఆంధ్రలోకానికి అందిచ్చాడు.

ఒకానొకరి ధర్మపత్ని భౌతికదేహము విడిచి ఊర్ధ్వలోకాలకు వెళ్ళుతూ తారా పథములో అన సూయా దేవిని కలుసుకొంటుంది. పాతివ్రత్య శ్రీ విలసిల్లిన సతుల ప్రభావాలను చెప్పమని కోరుతుంది. మూడవ ఆశ్వాసములో అనసూయాదేవి ఆ ధర్మపత్నితో ‘సీత, ‘ద్రౌపది’ వీరి పాతివ్రత్య మహ త్వాన్ని వర్ణించి తక్కిన రెండాశ్వాలలోనూ తన స్వంత అనుభవాన్ని విశదీకరించి అంతర్ధాన మవు తుంది.

ఈగ్రంథములో పూర్వకవుల పోకడలూ, కొన్నిపద్యాలలో అంత్యాను ప్రాసమూ తరుచుగా కన బడు తున్నవి. వీరికొ కొరుకు పోతనామాత్యునిపోలిక గుర్తించిన పద్యమొకటి ఉదాహరిస్తున్నాము.

> “పూతవు నిఖిలవ్రత సుస్నాతవు, రక్షిత సమస్త జగతీజన సం
> ఘాతవు- లోకాతీతవు మాతల్లీ! నిను నుతింప మాతరమగునే.”

దే. కృ



## కచ - దేవయాని; తీయనిబాధ.

భారతినుంచి పునర్ముద్రితములు

కర్త: శ్రీ ఆచంట జానకిరామ్.

ఆల్ ఇండియా రేడియోవారు మద్రాసునుండి జూలై 8 వ తేదీని బ్రాడ్‌కాస్ట్ చేసిన ఎనిమిది దృశ్యముల చిన్న నాటిక 'కచ - దేవయాని.'

ఈ నాటికలో ఇతివృత్తము కచునకూ దేవయానికీగల ప్రణయము.

కచుడు శుక్రాచార్యుల ఆశ్రమము చేరబోయేసరికి దేవయానిహృదయము చంద్రకిరణాలను అందుకోబోయే సముద్రపు కెరటాలవలె అనంగముతో తుళ్ళింతలాడినట్లు చిత్రించడము హృద్యముగా ఉన్నది. దేవయాని కచుణ్ణి క్షణమైనా వదలి ఉండలేనంత గాఢముగా ప్రేమించడమూ, కార్యదీక్షే ప్రధానముగా పెట్టుకొన్న కచుడు ఆమెమీద ఎంత అనురాగమున్నా తప్పించుకొని తిరగడమూ, మృతసంజీవని విద్య అలవడ్డతరువాత దేవయాని ప్రార్థనము నిరాకరించి దేవలోకానికి అతడుపోవడమూ, దేవయాని సాహచర్యము దొరకని జీవితము శూన్యముగా కనబడి అతడు విలపించడమూ మొదలయిన ఘట్టాలన్నీ సరసముగా లలితముగా చిత్రించినాడు కృతికర్త.

ప్రస్తావనలోనూ నాలుగోదృశ్యములోనూ ఆంధ్రభారతములోని ఘట్టాలు కథాసందర్భము సూచించడానికి కథకునిచేత చెప్పించడము రచయిత కళానైపుణ్యాన్నీ అతనికి భారతములో ఉన్న అభిరుచినీ తెలియచేస్తున్నది. ఈ నాటికలో ప్రస్తావన 'స్థాపన' వంటిది. నాటకారంభములో కథాసందర్భము పాత్రల సంభాషణద్వారా చెప్పించడముకంటె ఈరీతిగా కథకునిచేత చెప్పించడము రేడియో నాటకానికి మిక్కిలి అనుకూలము. నాలుగవదృశ్యములో రాక్షసులు కచుణ్ణి చంపి బూడిదచేసి అది మద్యములో కలిపి శుక్రాచార్యులచేత త్రాగించడమూ, మృతసంజీవనీ మహాత్మ్యమువల్ల శుక్రాచార్యులు కచుణ్ణీ, కచుడు శుక్రాచార్యులనూ బ్రతికించడమూ ప్రదర్శన యోగ్యముకాకపోవడమువల్ల కథకునిచేత భారతములోఉన్న ఘట్టము చదివించడము యోగ్యముగానే ఉన్నది.

కృష్ణశాస్త్రిగారి విరహగీత మొకటి సందర్భోచితముగా ఎనిమిదవ దృశ్యములో ఎత్తుకొనడమువల్ల నాటికకు కొంత మెరుగు వచ్చినది.

'తీయనిబాధ' స్కెచ్‌వంటిది.

నిజమైనప్రేమ ఒకవింతభావము - స్వప్నమువంటిది. జీవితములో దానిని అనుభవించడము అరుదు. ఏదో ఆశయము మనసులో పెట్టుకొని దానిని భావనచేస్తాము. అన్వేషిస్తాము. ఆరాధిస్తాము. ఏవ్యక్తిలోనో దానినిగుర్తించి చేసే ఆరాధనకూడా కేవలము ఆశయారాధనమే ఏదో ఒకలోపము ఆవ్యక్తిలో కనబడ్డప్పుడు ఆశయభంగమువల్ల ఆవేదన - తీయనిబాధ - కలుగుతుంది.

ఈ తీయనిబాధ కలిగే పరిస్థితులు పలువిధములు. అప్రాప్తమనోహరులవల్లా, అసమానదాంపత్యాలవల్లా అభిరుచుల వ్యత్యాసాలవల్లా అనేకరీతులుగా ఈ తీయనిబాధ పురుషులకూ స్త్రీలకూ అనుభూతమవుతూ ఉంటుంది.

కల్పితములైన పాత్రలూ, సన్నివేశములూ కూర్చి వ్రాసినదే అయినా 'ఈ తీయనిబాధ' వాస్తవానుభవ ప్రకటనమువలె ద్యోతకమయే రీతిని సరసముగా రచించిన రచయితనేర్పు శ్లాఘాపాత్రము.

దే. కృ.

△

## గోభూమి

ఫూల్‌స్కేపు సైజు 64 పుటలు. వెల నాలుగు అణాలు

కర్త: నాగేశ్వరరావు

కిసాన్ ప్రెస్, 23 స్ట్రింగరువీధి, మద్రాసు.

నవ్యసాహిత్యంలో ప్రచారక లక్షణాలు కల గ్రంథాలలో ఇది ఒకటి. నవ్యయుగంలో గోమాత తన వెనుకటి ఔన్నత్యమును తిరిగి సంపాదించుకొనటానికి ఇటువంటి గ్రంథాలు చాలా అవసరము.

''నీ పాలము లాగేసి, నిన్ను తరమేసీ
నగరాలకెళ్ళేదాము, నన్ను రమ్మంటారు
నేనెట్లు పోయేది నిన్నొదలి''

ఈ శ్రేణిలో 55 గేయాలున్నవి.

కర్షకులు పాడుకొనుటకు వీలుగా సుబోధమయిన తేటమాటలలో ఉన్న ఈ గేయాలు కర్షక సాహిత్యానికి అలంకారములు,

''యజమానులెల్లాలి మిల్లు మానకొదలి
భూస్వామి పోవాలి భూమి మనకిచ్చి
భారతమ్మను వదలి, భూదేవి నొదలి
లోకముడుచుకు తెప్పకట్టుకు
సరకిపోవలి తెల్లజాతులు''

మొదలయినవి సామ్యవాదులలో ఉత్తాముల శ్రేణిని చూపిస్తూ కవిత్వానికి దూరంగా ఉన్నవి. ఈ 'గోభూమి'ని శ్రీమతి భారతీదేవి రంగాగారు ఆశీర్వదించారు. ఈ ఉపోద్ఘాతం గ్రంథప్రాశస్త్యాన్ని యినుమడింపజేసినది. యంత్రాలు అనే గేయంలో,

''యంత్రాలున్నేను ఎవరికీ లాభాలు
అందరము హాయిగా ఆలరారనమ్మ''

పారిశ్రామికాభివృద్ధి దేశానికి ఆర్థికంగా చాల మంచిదని చెప్పారు.

''వీరావేశము'', ''కామధేనువు'' ''కొంపెకంపాము'' అనే గేయాలలో గోమాతయెడగల ప్రేమాతిశయాలను బాగా చిత్రించారు.

''ముట్టికిందకుపెట్టి, తోకలను పైకెత్తి
రంకెలేసుక మేము పరుగులెత్తిననాడు
మృగరాజు పందయై పారిపోయినమాట
కంససేనలు బెదరి, కరగిపోయినగాథ
అప్పుడే అందరూ విస్మరించారా!
మమ్మొదలి చూసిండి ఏమిచేస్తారో!''

ఉత్తేజకరములైన ఇలాంటిభావాలు చాలాగేయాలలో సూటిగా చెప్పబడినవి.

దే. కృ.

Δ

**ముద్దు—పాపాయి : (పద్యకావ్యాలు) నాళం కృష్ణారావు**
**బుచ్చి బాబు కథలు : బుచ్చి బాబు**
**కృష్ణమూర్తి కథలు : తాత కృష్ణమూర్తి**
**మునిమాణిక్యం కథలు : మునిమాణిక్యం నరసింహారావు**
**ప్రకాశకులు : నమ్మాళ్వార్సు, పోష్టుబాక్సు ౨౯౧, మదరాసు.**

ఈ పుస్తకాలే కాక, ఇంకా చాలా గ్రంథాలు ప్రకటిస్తూ ఒక్కొక్క పుస్తకానికి ౮ అణాల వెల మాత్రమే ఉంచి జనసామాన్యానికి అందుబాటులోనికి తెచ్చినారు. ప్రకాశకులైన శ్రీ జమిలి నమ్మాళ్వారు సంస్కృతాంధ్ర ఆంగ్లభాషలు చదువుకొన్న ఆంధ్రవైశ్య శిఖామణులు. గుంటూరువారు సారస్వత వ్యాప్తికి పూనుకొన్న వీరి ప్రయత్నము శ్లాఘాపాత్రము. శి. రా.

Δ

## ముద్దు - పాపాయి

"ఆధునిక ఆంధ్ర కవులలో మాన్యత గడించినవారిలో నాళము కృష్ణారావుగారొకరు... శ్రీవారికి 'మధురకవి' 'బిరుద మీయబడినది'' 'గాంగితము' 'పాల తరగలు' మున్నగునవి వారి యితర కృతులు. "ముద్దు కావ్యమున అద్భుతములో అమోఘమౌ సౌందర్యము" ఉంది. "ముద్దుబోలిన ముచ్చట పుడమి గలదె"అని మకుటంగా కవి ముద్దుయొక్క పుట్టుపూర్వోత్తరాలు హాయిగా వర్ణించారు. లలిత భావనతో మధుర భాషలో ఈ కావ్యం ప్రశస్తి కెక్కింది. ముద్దు "వలపు చేనిలో తొలికారు పండుపంట" "మనసు అంగడికొట్టులో మచ్చు దినుసు... చెరకు పాకం దోసంగడు వెలగచేయి" అన్న కావ్యకర్త మంచి వ్యవహర్తగా కూడా కనుపిస్తాడు. ముద్దు ముద్దుగా ఉన్న ఈ "ముద్దు" అందరికీ ఆపేక్షణీయం, ఆదరణీయమున్నూ — గ్రాంథికమైన సంధి దోషాలు (?) లేకుంటే.

"పాపాయి కావ్యమున విషాదములో సానుభూతి మాధుర్యము" ఉంది. తన కన్నకొడుకు చనిపోతే "అక్కరము కొక్క కన్నటిముక్క గాదు, వ్రాయుచుంటిని నీవేర పద్యములు" అని కొడుకుని సంబోధించి ఈ కావ్యం వ్రాసినాడు కవి. "నాద సంగీత సాహిత్య సరిత మగుచు, శ్రుతిహితంబగు త్యాగయ్యకృతియు బోలె" చిన్నదైనా, రసికజన రంజకమైన పాపాయి జీవితం ఇందలి కథావస్తువు. "శ్రుతులు సమ్మేళనము చేసి సొంపుమీరగ రాగమాలికా పగిది పాడు బిడ్డలయ్య!" అప్పుడా తండ్రి గుండె ఎంత పగిలిందో పాపం! "చిత్తమున ముంగాం కోర్కులు జీర్ణమయ్యె"నట! కావ్యం చదువుతున్నంతసేపూ ప్రతి సహృదయునికీ కన్నీరు కదలిక మానదు. "తండ్రి బిడ్డల అన్యోన్యతత్పరత్వమవని కెందాక నుండునో అంతదాక వెలయుగాత 'పాపాయి' విమలకీర్తి!" శి. రా.

## బుచ్చిబాబు కథలు

ఇందులో ఐదుకథలు ఉన్నాయి. కథ చెప్పడంలోని మెలకువలు బుచ్చిబాబుగారికి ఇంకా బాగా అలవడకపోయినా, వీరు చెప్పదలచుకున్నది చాలా ఉన్నట్టు కనిపిస్తుంది. అన్నికథలూ, 'నెపోలియన్' సహా, sex ని గురించినవే! వీరు చెప్పదలచుకున్నదంతా నిర్మొహమాటంగా చెప్పేరకం. 'అగో

చరుడు' అన్న కథ నిజంగా గుండెకు పట్టేదే! 'చిన్ని'లో నీతినిగురించి ఎక్కువగా కనుపిస్తుంది. 'నెపోలియన్'లో పెద్ద ఆశయం లేకపోయినా శాస్త్ర నవ్వుకోడానికి అక్కరకువస్తుంది. 'మల్లెపూలూ,' 'కలలో కార్చిన కన్నీరు' ఒకరకం - స్త్రీ పురుషుల కామోద్రేకం, ప్రతిబింబించే ఈ కథలలో ఒక నీతి లేకపోలేదు. చిట్టిబాబుగారు ముందు ముందు ఇంకా మంచికథలువ్రాసి ఆంధ్రసారస్వతసేవ చేస్తారనిఆశయం.
శ. రా.

## కృష్ణమూర్తి కథలు

ఇందులో 'తొలిబిడ్డ' 'భీమపాకం' 'రవికలగుడ్డ' 'సినిక్ మగడు' అనేవికొన్ని సాంసారిక విషయాలకు సంబంధించిన చిత్రాలు. 'పెంపుడుకుక్క,' 'సత్యాన్వేషణ' 'విమానం పరదా' అనేవి, పాశ్చాత్య నాగరికతలో, శాస్త్రపరిశోధనలో కొన్ని అంశములకు సంబంధించినవి. వీటిని కథలనటం కంటే స్కెచెస్ అనటం ఎక్కువ సమంజసంగాఉంటుంది. శ్రీ కృష్ణమూర్తిగారు నవ్యసాహిత్యంలోకి Lamb, Hazlitt, ఇత్యాది ఇంగ్లీషు రచయితల పోకడలు తీసుకువచ్చాడు. ఆయనిది యుగంలో అంతా కవిత్వధోరణిలో మునిగి తేలుతున్న రోజులలో తెలుగులో, సహృదయులకు ఆహ్లాదము కలిగించే ఉత్తమ వచనరచనలు చేసేవారు లేరన్న లోపము వీరివల్లతీరినది. 'తొలిబిడ్డ'లో "స్వార్థరహితమై, స్థిరమై, అగాధమైన మాతృప్రేమ"లో ఉండే మహిమనూ, మాధుర్యాన్నీ, పూర్తిగా అవగతం చేసుకున్న లక్ష్మిని గ్రంథకర్త చాల నేర్పుతో సృష్టించాడు.
వీరి శైలి గంభీరముగా గట్టుదాటి ప్రవహించు ప్రవాహమువలె ఊహాపుష్టిగల భావాలతో తొణికిసలాడుతున్నది.

ఊహాలు ఒకటి కొకటి పెనవేసుకొని ముప్పేటపేనిన తాడువలె మనకు ఆహ్లాదమునూ ఇంపునూ కలిగిస్తున్నవి.

120 పేజీ విమానంపరదాలో "చెట్లమీదుగా గుట్టలమీదుగా బ్రహ్మాండమైన వేగముతో విలాసంగా ఊరేచుట్టూ...............సాగించినపు............జనులు పశువులు బండ్లు అన్నీ క్రమంగా చిన్నచిన్నవై ఆకారంలేనివై రంగులమచ్చలై నలుసులై రేణువులై మాస్తూపంపగానే అంతలోనే అదృశ్యములైనాయి." ఇలాంటి కొన్నికొన్ని ఘట్టాలు భావనాపటిమతెలియజేస్తున్నవి.
'సినిక్ మగడు'లో భర్త ఒక విచిత్రసృష్టి. "మరి వాడికి పళ్లు వస్తున్నాయంటే ముందు జరుగబోయే దుఃఖమయగాథకు తొలిప్రకరణం ప్రారంభమైనదన్నమాట" అని అంటాడు. అంతటితో ఆగక దంతబాధను గురించి ఒక మహోపన్యాసం ఏకబిగిగా ఇస్తాడు. ఇలాంటి విచిత్రవ్యక్తిని సృష్టించిన కృష్ణమూర్తిగారు ప్రశంసాపాత్రులు.
ఈ పుస్తకంలో 'భీమపాకం' ఇదివరలో ప్రతిభలో ప్రకటితమైనదే
'సత్యాన్వేషణ'లో టెస్ట్‌ట్యూబ్ బిడ్డలు గ్రాండువారిత్మనుధియరీ మొదలైన శాస్త్రపరిశోధన విషయాలు చిన్న ఊహాచిత్రాల్లో మనోహరభావ సన్నివేశాలలో ఇమిడ్చటంలో గొప్ప నేర్పరితనం చూపించాడు. "టెస్ట్‌ట్యూబ్' పిల్లలని సిర్మిస్తున్నారంటే ఎంత ఆశ్చర్యకరమయిన విషయమో ఆలోచించు" అని చెప్పుతున్న భర్తతో భార్య, స్త్రీ హృదయం, మాతృప్రేమలోగల సుకుమారతత్వాన్ని గురించి ఉపన్యాసంచెప్పి టెస్ట్‌ట్యూబ్ పిల్లల పద్ధతిని ఖండిస్తుంది.

## బ్రిటిష్ ఇండియా చరిత్ర

గ్రంథకర్త : దిగవల్లి వేంకట శివరావు, వకీల్, బెజవాడ.

క్రౌన్ 440 పుటలు – వెల రు ౧-౮-౦.

"భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రయుగము అను బ్రిటిష్ ఇండియా చరిత్ర" అమూల్యమైనది. ఎన్నో గ్రంథాలు చదివి ఎన్నో ఏళ్లు కృషిచేస్తేనేగాని ఇలాంటి వాస్తవ చరిత్ర వ్రాయడం దుర్ఘటం. హిందూదేశచరిత్ర ఒక మహారణ్యమనీ, శ్రీశివరావుగారు దివ్వె చేత్తోపట్టుకుని అరణ్యంలో నడుస్తూ మనకి చెట్లూ, పువ్వులూ, కాయలూ, పళ్లూ చూపిస్తూ మనల్ని నడిపిస్తున్నారని శ్రీ వేలూరి శివ రామశాస్త్రిగారి పరిచయవాక్యాలు. అంతేకాదు. దారిపొడుగునా నిశితకంటకాలూ, విషకీటకాలూ, ఘోరమృగాలూ, భీకరరహస్యాలూకూడా కనబడతాయి.

గ్రంథమంతా మూడుభాగాలు; మొత్తం ఇరవైయేడు ప్రకరణాలు. బ్రిటిష్‌యుగానికి పూర్వం నాటి భారతదేశస్థితి మొదలుకొని కాంగ్రెస్ ప్రభుత్వోద్యమం వరకూ భారతీయులగాథ నిష్పాక్షికంగా, నిరాఘాటంగా నిరూపింపబడింది ఈ గ్రంథంలో.

చరిత్ర చదువుతూంటే విసుగెత్తిపోవడం అలా ఉంచగా, నవరసాలతోనూ చక్కని కథలుగా నడుస్తుంది.

బ్రిటిష్ ఇండియాయొక్క ఆర్థిక రాజకీయవిషయాలు తెలుసుకోవాలంటే ఈగ్రంథం సరిగ్గా నిజంగా చెపుతుంది; ప్రతి ఆంధ్రుడు చదవదగ్గ – చదవవలసిన – ఉత్తమ చరిత్ర ఇది. ఈ చరిత్రకారుడు సత్యశిల్పి; శతవిధాల ఆదరణీయుడు, ప్రశంసార్హుడు. శి. రా.

Δ

## యువ కథావళి

యువకార్యాలయం, తెనాలి, వెల పావలా

ఎన్నదగిన ఆరుగురు కథకుల కథాసంపుటి

మొదట కనుపించే 'శివోహమ్' లో ప్రణయ తైర్థయాత్రకు బయలుదేరిన ఒక రసిక జీవనంలోని విఫలతా, నైరాశ్యం అసమానంగా చిత్రింపబడ్డాయి. కథకుడు మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు సిద్ధహస్తుడు.

'ఉష' చిత్రమైన ప్రణయగాథ – అమర్త్యం. అద్భుతమైన రచన. వేంకటచలంగారి కూతురనిపించుకుంది సౌరిస్ – కథాశిల్పంలో. కొన్ని ఘట్టాలలో తండ్రినిమించిందేమో కూడా.

'నీతిపరుడు' చదువుతూంటే మనస్సూ హృదయమూకూడా కొట్టుకుంటాయి, మానవకల్పితమైన నీతికీ ఈశ్వర ప్రసాదితమైన ప్రేమకీ, సంఘర్షణ వస్తే మానవుని బ్రతుకు ఎలాఅవుతుందో కుటుంబరావు గారు చక్కగా చూపించారు.

ఈ కథావళిలో ఉన్న కథలన్నీ సుమారైనవే: అందుకు యువకార్యాలయంవారు అభినందనీయులు. వారు ఇంకా బాగా ప్రయత్నించి మంచి మంచి కథలు అందుబాటులోకి తెచ్చుకుని ప్రకటిస్తారని మా ఆశయం. తగిన ప్రోత్సాహం ఇచ్చేబాధ్యత ఆంధ్రపాఠక లోకానిది. శి. రా.

Δ

# సంపాదకీయము

## అఖిలాంధ్ర, సాహిత్యపరిషత్తు

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆగష్టు 15 తేదీని వెలువడ్డ గోలుకొండ పత్రికలో గ్రాంథిక వ్యావహారిక భాషా సమస్యవిషయములో ఇరుపక్షముల వారికీ సమాధానం కలిగించడం మధ్యస్థులైన తమబోటివారికి విధి కృతమనే సద్భావముతో "అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు జరుగవలెను" అను శీర్షికతో ఒక వ్యాసము ప్రకటించినారు. వారు గ్రాంథిక భాషావాదులు. విద్యార్థిదశనుంచీ వారికాపక్షముమీదనే అభిమానము. అయినా వ్యావహారిక భాషావాదుల మతస్వరూపము వారు బాగా పరిశీలించినట్లు కనబడుతుంది. వ్యావహారిక భాషావాదులు చేస్తూవచ్చిన ప్రచారమూ, దాని ఫలితముగా దేశములో గలిగిన సంచలనమూ, సజీవభాషలో రచించిన కథలూ, ప్రహసనములూ, నాటకములూ, వ్యాసములూ, విరివిగా ప్రకటిస్తూఉన్న పత్రికలున్నూ శాస్త్రగ్రంథములు, విమర్శగ్రంథములూ మొదలైనవిన్నీ వెలువడుతూ ఉండడమూ, వినోదముకోసముగానీ, జ్ఞానము పెంపొందించుకొనుటకుగానీ పత్రికలూ గ్రంథములూ చదువవలెననే వాంఛ ప్రజలలో నానాటికీ ఎక్కువ కావడమూ గమనిస్తూఉన్న శ్రీ ప్రతాపరెడ్డిగారికి గ్రాంథిక భాషాభిమాన మెంత ఉన్నా దేశములోఉన్న ప్రస్తుత పరిస్థితులను బట్టిచూడగా ఈరెండు పక్షములవారూ ఇంకా వాదోపవాదములు సాగిస్తూ ఉండడము అనుచితమనీ, అనర్థదాయకమనీ తోచి సమాధానము కలిగించవలెననే అభిప్రాయము కలిగినదని భావిస్తున్నాను. వారిసద్భావము చాలా అభినందించతగినది.

సమాధానము ఏయేవిషయాలలో ఏయేరీతుల కుదురవలెనో తమ అభిప్రాయము నిరూపించే సందర్భములో సర్కారు జిల్లాలవారి వ్యావహారికభాషే అన్నిప్రాంతాలకూ ప్రమాణభాషగా విధించేలాగుంటే, అదిన్నీ గ్రాంథికభాషవలెనే సుపరిచితమై ఉండక ప్రయత్నపూర్వకముగా అభ్యసించవలసేవుంటుంది గనుక, హైదరాబాదు వారికీ రాయలసీమవారికీ అది అంగీకారముగా ఉండదని వ్రాసినారు. మామిత్రులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈవిషయముగురించి గోలకొండలోనే ప్రకటించిన వ్యాసములో శ్రీప్రతాపరెడ్డిగారి సందేహములు తీరుస్తూ, ఏప్రాంతము వారైనా తమవ్యవహారములో ఉన్నభాషలోనే వ్రాయవలసినదని వ్యావహారిక

లంబించకపోతే భిన్నత్వము నానాటికీ అతిశయిస్తుంది. మాండలికభేదములు పెరగ నిచ్చినట్లయితె కొంతకాలానికి తెలంగాణము తెలుగూ, సర్కారు తెలుగూ వేరు వేరు భాష లనేటంత భిన్నమై వేరుపడవచ్చును.

మనభాష ఆ రీతిగా చీలి పోకుండా ఉండేపద్ధతి అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు సమకూడి ఆలోచించవలసి ఉన్నది. ఈ పనికోసమైనట్లయితే పరిషత్తు జరగటానికి కావలసిన యేర్పాట్లు తప్పక చేయవలసినదని శ్రీ ప్రతాపరెడ్డిగారినే కోరవచ్చును. అంతేకాని గ్రాంధికభాషావాదులకూ, వ్యావహారిక భాషావాదులకూ, అనగా ఆంధ్రసాహిత్య పరిషత్తువారికీ వ్యావహారిక భాషావాదులకూ సామరస్యము కల్పించటానికి అఖిలాంధ్రభాషాపరిషత్సమావేశము చేయవలెనంటే అందువల్ల ఎంత మాత్రమూ ప్రయోజనము ఉండదని ఇదివరకున్న అనుభవంవల్ల చెప్పవచ్చును. సామరస్యము కుదర్చవలెనని ఇదివర కెంతమంది ఎన్నివిధముల ప్రయత్నించలేదు. మధ్యస్థులున్నూ, వారేకాక వ్యావహారిక భాషావాదులున్నూ ఏ రీతిగా ఈ ప్రయత్నము చేసినారో, రెండవ పక్షమువారు ఎంత విముఖత్వము ప్రకటించినారో చూతురుగాక.

1. చెన్న విశ్వవిద్యాలయములో ఇంటర్మీడియేట్ తెలుగు కాంపొజిషన్ కమిటీవారు ఇంటర్ తరగతి విద్యార్థులు వ్యాసరచనలో ఎట్టి భాషప్రయోగించవలెను. అనే విషయమును చర్చించినపుడు ఆకమిటీలో సభ్యులుగావున్న గురజాడ అప్పారావు పంతులుగారు, గిడుగు రామమూర్తిపంతులుగారు, బుర్రా శేషగిరిరావుగారు గ్రాంధిక వ్యావహారికభాషలకు సామరస్యము కుదుర్చవలెనని ఎంతో ప్రయత్నముచేసినారు గాని ఆకమిటీలోఉన్న గ్రాంధిక భాషావాదుల అక్రమచర్యలవలన వారి ప్రయత్నములు నెఱవేరినవికావు. ఇది 1913 వ సంవత్సరమునాటి విషయము.

2. 1916 వ సంవత్సరములో కొవ్వూరులో జరిగిన ఆంధ్ర సారస్వతమహాసభలో వ్యావహారికభాషావాదులూ గ్రాంధికభాషావాదులూ కూడి తెలుగుమాటల సాధుత్వాసాధుత్వములు ఏరీతిగా నిర్ణయము చేయవలెనో సూచించడానికి ఈ దిగువ తీర్మానము చేసినారు.

"తెలుగుమాటల సాధుత్వాసాధుత్వములు స్పష్టముగా బోధించే తెలుగువ్యాకరణము లేనందుచేతను, ఉన్న వ్యాకరణములు పరస్పరవిరుద్ధములుగాను, అసంపూర్ణములుగాను ఉన్నందుచేతను వ్యాకరణమునకు మూలము ప్రయోగములే యగుటచేతను,

తెలుగు గ్రంథములలోని ప్రయోగములు ప్రమాణములుగా అంగీకరింపక తప్పదు.”
“నేటి వాడుకలోనున్న పదములు నూరుసంవత్సరములనుండి పెద్దల వాడుకచొప్పున నున్నట్లు నిదర్శనములున్నపుడు అవి నిర్దుష్టములుగా నెన్నవలెను. నేడు తెలుగుదేశ మందంతటను పెద్దలవాడుకలో నేకరూపముననున్న పదములుకూడ పూర్వకాలపు గ్రంథములలో కనబడకపోయినను నేటిగ్రంథములలో నున్న యెడల సాధువులే!”
శిష్టజనవ్యవహారములోనున్న భాష ప్రమాణభాషగా ఎన్నవలెననే అభిప్రాయంగల వ్యావహారికభాషావాదులు ఇట్టి తీర్మానము అంగీకరించడము గ్రాంథికవ్యావహారిక భాషావాదులకు సామరస్యము కలిగించవలెననే భావము వారికి ఉండడమువల్లనే అని ఇందువల్ల స్పష్టమవుతూనే ఉన్నదిగదా.

3. 1924 వ సంవత్సరములో తెనాలిలో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తు 13 వ వార్షిక సభలో శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు ప్రవేశపెట్టగా ఆంధ్రసాహిత్య పరిషత్తువారే (ఆ సమావేశానికి శ్రీ జయంతి రామయ్యపంతులుగారు రాలేదనే విష యము పాఠకులు గుర్తుపెట్టుకొందురుగాక) ఆమోదించిన ఈ క్రింది తీర్మానము వ్యావహారికభాషావాదులు గ్రాంథికవాదులతో సమాధానముపడుటకు చేసిన ప్రయ త్నమును విశదీకరిస్తున్నది; “గ్రామ్యము కాని వ్యావహారి కాంధ్రభాషలో పూర్వ సంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చునని ఈ సభవారు తీరానిస్మించు చున్నారు.” పరిషత్తు వా రామోదించిన యీ తీర్మానమునకు ఏ గతి పట్టినదో తరువాత వివరిస్తాము.

4. 1924వ సంవత్సరములోనే శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు రాజమహేం ద్రవరములో వ్యావహారిక భాషావాదముగురించి కొన్ని ఉపన్యాసములుచేసి వెళ్ళిన తరువాత శ్రీ జయంతి రామయ్యపంతులు గారక్కడికివచ్చి రాజమహేంద్రవర పౌరు లను తమ మతములోనికి త్రిప్పుకొనుటకు కాబోలును పురమందిరములో ఒక సభ ఏర్పాటుచేసినారు. ఆ సభలో వారు కొంతసేపు ఉపన్యసించినతరువాత శ్రీ జయంతి గంగన్నగారు లేచి, ఒకవంక రామమూర్తి పంతులుగారు, ఇంకొకవంక రామయ్య పంతులుగారున్నూ ఈ రీతిగా ఉపన్యాసములద్వారా ప్రచారము చేయడమువల్ల అంతగా ప్రయోజనమేమీ లేదనీ, రెండుపక్షములవారూ ఒకచోట సమావేశమై ఏదోఒకవిధముగా సమాధానపడడం అత్యవసరమనీ, ఇరుపక్షములవారూ అంగీకరిం చిన కొందరుతీర్పరులయెదుట వారు తమతమ మతములగూర్చి వాదించి ఆ పెద్దలు

చెప్పినతీర్పు అంగీకరించడానికి బద్ధులై ఉండేయెడల అట్టి సమావేశము తాము రాజమహేంద్రవరములోనే కొద్దిదినములలో ఏర్పాటుచేస్తామనీ, శ్రీ రామమూర్తి పంతులుగారు వచ్చేదాకా రామయ్య పంతులుగారు రాజమహేంద్రవరములో ఆగవలసినదనీ కోరినారు. ఎంతో ఉత్సాహముతోను సద్భావముతోను వారుచేసిన సూచన నిరాకృతమైనది.

5. 1924 వ సంవత్సరములో ఆంధ్ర సాహిత్యపరిషత్తు 13 వ వార్షికసభలో ఆమోదించిన తీర్మానము శ్రీ జయంతి రామయ్యపంతులుగారికిన్నీ, పరిషత్ప్రతిష్ఠాపకులలో ఒకరున్నూ యావజ్జీవాధ్యక్షులున్నూ ఐన శ్రీ పిఠాపురం రాజావారికిన్నీ ఇష్టము కానందువల్ల ఆతీర్మానము రద్దుచేయడానికీ, అంతేకాక అలాంటి తీర్మానము శ్రీ రాజావారిఅనుమతిలేకుండా పరిషత్సమావేశములో ఎన్నడూ చర్చకు తీసుకొనిరాకుండాను గట్టిగా కట్టుదిట్టములు చేయడానికిన్ని 1926 వ సంవత్సరము ఫిబ్రవరి 7 వ తేదీని కాకినాడలో కార్యనిర్వాహకవర్గసభ జరిపి ఈరీతిగా తీర్మానించినారు.

"ఆ 1924 వ సంవత్సరము అక్టోబరు 12 వ తేదీన తణుకులో జరిగిన పరిషత్ సభలోఁ జేయఁబడిన పదవతీర్మానము గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట కవకాశముండుటచేతను ఈపరిషత్తువారికి గ్రామ్యవాద. మనంగీకారమగుటను ఆ తీర్మానమును ద్రోసివైచి 1914 వ సంవత్సరము ఏప్రిల్ 19 వ తేదీని కాకినాడలో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడినట్టియు ఆనందసంవత్సర పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినట్టియు తీర్మానమునే యీ సభవారు స్థిరపరచుచున్నారు".

"ఇకముం దెప్పుడైనను పైనుదహరింపబడిన తీర్మానమువిషయమై పునర్విమర్శనము జరుగుట యావశ్యకమని కార్యనిర్వాహకసభవారికిఁ దోచినపుడేగాని యట్టి పునర్విమర్శనము జరుగఁగూడదనియు, జరిగినప్పుడప్పటికి పరిషత్సభ్యులుగా నుండి విషయనిర్ణయమునం దభిప్రాయ మిచ్చుట కధికారము గలిగిన సభ్యు లందఱిలో 100 కి 66 గురు గాని అంతకెక్కువమందిగాని యామోదింపనిదే యా తీర్మానమును మార్చగూడదనియు నీ సభవారు తీర్మానించుచున్నారు."

ఈ రెండవతీర్మానా న్ననుసరించియైనా ఎప్పుడైనా వ్యావహారిక భాషావాదులు అధిక సంఖ్యాకులు పరిషత్తులో సభ్యులుగా చేరి తిరిగి వ్యావహారికభాష కనుకూలముగా ఉన్నట్లు తాము భావించిన శ్రీ రామమూర్తి పంతులుగారి తీర్మానాన్ని తిరిగ ప్రవేశపెడతారేమో అనే భయంవల్ల కార్యనిర్వాహకవర్గ నిర్మాణములో నీ క్రిందిమార్పు చేసినారు.

"ఇప్పుడున్న కార్యనిర్వాహక సభ్యులసంఖ్య అత్యధిక మగుటచేత నికముందా సభ్యుల సంఖ్య 15 కంటె నెక్కువగా నుండగూడదనియు నా సభ్యులలో మూడవవంతుసభ్యులు యావజ్జీవాధ్యక్షునిచే *అంటే శ్రీ పిఠాపురం మహారాజావారిచే నియమింపబడవలయు ననియుఁ దక్కినవారిని పరిషత్సభ్యు లెన్నుకొనవలయుననియు నీసభవారు తీర్మానించు చున్నారు." ఇంకా ఈ కట్టుదిట్టము చాలదని కాబోలు "రాబోవు వార్షికోత్సవము కూడ కాకినాడలోనే జరుగవలయునని నిశ్చయింపఁబడినది" అని తీర్మానించినారు. ఎందువల్లనంటే శ్రీ పిఠాపురం మహారాజావారి అధీనంలో ఉన్న కాకినాడలో కాక ఇంకొకచోట వార్షికసభ జరిగినట్లయితే సాధారణసభ్యుల సమావేశములో కార్య నిర్వాహకవర్గమువారు చేసిన పై తీర్మానములు ఆమోదింపబడవేమో అనుభయము, నాడు తణుకులో జరిగిన సమావేశంవల్ల గట్టిగా పట్టుకున్నది.

ఆంధ్రసాహిత్య పరిషత్తులో సభ్యులుగాఉండి గ్రాంథికభాషావాదులలో గట్టివారని పేరుపొందిన దిగ్గజాలవంటి పండితులు కందుకూరి వీరేశలింగంపంతులుగారు, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, అక్కిరాజు ఉమాకాంతం గారు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, తాతా సుబ్బారాయశాస్త్రిగారు మొదలైనవారు ఎంతోమంది వ్యావహారికభాషావాదాన్ని ఆమోదించినా వ్యావహారిక భాషావాదము దేశమంతటా అల్లుకొన్నా వ్యావహారికభాషలో వ్రాయడమే ఇప్పటి పరిస్థితుల కనుగుణముగా ఉన్నదని చెప్పుతూ ఈనడుమనే ఈమార్గమవలంబించిన శ్రీ హరి నాగభూషణంగారి వంటిపండితు లెంతోమంది వ్యావహారికభాషా ప్రాశస్త్యాన్ని ప్రాధాన్యాన్ని అంగీకరించినా ఆంధ్రసాహిత్యపరిషత్తువారు మాత్రం - అంటే శ్రీ పిఠాపురం మహారాజావారున్నూ, శ్రీ జయంతి రామయ్యపంతులవారున్నూ, వారిపోషణము వాంఛించే కాశీభట్ల సోదరులూ, తత్తుల్యులూను - వ్యావహారిక భాషావాదాన్ని పూర్తిగా అంగీకరించక పోవడము అటుండగా వారితో ఒకవిధమైన సామరస్యము కలిగి ఉండడానికికూడా ఎంతమాత్రమూ సుముఖులుగా ఉండుటలేదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు సమాధానపడడానికి విముఖులు. అఖిలాంధ్రసాహిత్య పరిషత్తనేది ఒకటికూడినా అది ఆంధ్రసాహిత్య పరిషత్తువారి దృక్పథాన్ని అనగా ఇంకా 1914వ సంవత్సరము ఏప్రియల్ 19వ తేదీన కాకినాడ పరిషత్సభలో ఆమోదించిన తీర్మానముమీదనే స్థిరముగా దృష్టినిల్పుకొన్న స్థాణుత్వమును మరల్చలేదు,

కదల్చలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తుసభ్యులు—ఆ సభ్యులిప్పుడు పదిమందో పాతిక
మందో కంటె ఎక్కువలేరని తోస్తుంది. కాని గ్రాంథికవాదులు దేశములో ఎంతో
మంది ఉండవచ్చును. వారితో సమాధానపడుటకు ప్రయత్నము చేసినా చేయ
వచ్చును. శ్రీ ప్రతాపరెడ్డిగారి అభిప్రాయము అటువంటిదే అయినట్లయితే వారు
చేయబూనుకొన్నపనికి మేము అంగీకరిస్తాము. భాషావిషయములో సామరస్యము
కుదుర్చుటకు వారుచేసిన సూచనలు మా మతానికి అనుకూలముగనే ఉన్నందువల్ల
మేము చాలావరకూ ఒప్పుకొంటున్నాము.

వ్యావహారికభాష దేశమందంతటా ఏకముఖముగా ఉండేటట్లు చేయడానికి ఒక ప్రణా
ళిక తయారుచేయడానికిన్నీ, ఆంధ్రసాహిత్య పరిషత్సభ్యులుకాని గ్రాంథిక భాషా
వాదులతో భాషావిషయమైన సామరస్యము కుదర్చడానికిన్నీ శ్రీ ప్రతాపరెడ్డిగారు
అఖిలాంధ్రసాహిత్య పరిషత్సమావేశము ఏర్పాటు చేయుదురుగాక అని కోరు
తున్నాము.

**రమ్యాలోకము**

**తృణకంకణము**

రాయప్రోలు సుబ్బారావు

ఒక్కొక్కటి ౦-[illegible]-[illegible]

**వకుళమాలిక**

స్వగతరూపములో గీతికావ్యము. మధురభణితి ౧-౮-౦

**మధుకీల**

**కల్యాణకింకిణి**

మల్లవరపు విశ్వేశ్వర రావు

మనోహర ఖండకావ్య సంపుటములు. ఒక్కొక్కటి ౧-౦-౦

**అమరకావ్యము**

( ఉమర్ ఖయ్యామ్ రుబాయీల గీతికానువాదము )

శ్రీ రామచంద్ర అప్పారావు

**లక్కపిడతలు**

చింతా దీక్షితులు

బాలబాలికల [illegible]. చిత్రపట భూషితము ౧-౨-[illegible]

**గళ్ళచీర**

పురాణం కుమార రాఘవ శాస్త్రి

ఆంధ్ర సంసారాల [illegible] సహజమైన కథల సంపుటి ౦-౮-౦

**విరహి**

ముక్కపాటి కృష్ణమూర్తి

ఖండకావ్య సంపుటి ౧-౪-౦

**ప్రాప్తిస్థానము : నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు**


**Edited, Printed & Published by T. Venkataratnam, M. A., L. T.**
**Printed at the Andhra Grandhalaya Press. Bezwada.**
**Published at The Navya Sahitya Parishat, Guntur.**